మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



ద్వై మాసపత్రిక

నవంబర్ - డిసెంబర్, 2016




# నోట్ల రద్దు! జనం తిప్పలు





# అఖిల భారత మహాసభల మహిళా జాతా




అనంతపురం




విజయవాడ



కర్నూలు



గుంటూరు

# దేశభక్తి గేయం

- గురజాడ అప్పారావు

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా!
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయి!

పాడిపంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటుపడవోయి,
తిండి కలిగితె కండకలదోయి
కండకలవాడేను మనిషోయి!

ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నింపవోయి!

అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి
దేశి సరుకుల నమ్మవలెనోయి,
డబ్బు తేలేనట్టి నరులుకు
కీర్తి సంపద లబ్బవోయి!

వెనక చూసిన కార్యమేమోయి?
మంచి గతమున కొంచెమేనోయి
మందగించక ముందు అడుగేయి
వెనుకపడితే వెనకే నోయి!

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పకోకోయి,
పూని యేదైనాను నొకమేల్
కూర్చి జనులకు చూపవోయి!

స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడుపడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి?

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవెనోయి!

మతం వేర్రైతేను యేమోయి?
మనసు లొకట్టై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి!

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి!

# ఉద్యమ బాటలో...




నవంబర్ 25 హింసా వ్యతిరేక దినం : విశాఖ



ట్రిపుల్ తలాక్‌పై సంతకాల సేకరణ : అనంతపురం



ఐద్వా జెండా ఆవిష్కరణ : విజయనగరం




నోట్ల రద్దుపై ప్రదర్శన : రాజమండ్రి



ఐద్వా జెండా ఆవిష్కరణ : ప్రకాశం




నోట్ల రద్దుపై ప్రదర్శన : విశాఖ



దివీస్ పోరాటం : కాకినాడ



ఐద్వా జెండా ఆవిష్కరణ : విజయవాడ

సంపాదకీయం

చైతన్య మానవి

# ఆగమాగం

మోసేవాళ్ళకు బరువు తెలుస్తుంది. నోట్లు కాట్లు వేస్తున్నాయి. ప్రజల ప్రాణాలు హరీమంటున్నాయి. ఇప్పటి వరకు 80 మంది ప్రాణాలు పైకిపోయాయి.

గుజరాత్‌లోని సౌరాష్ట్రలో ఓ తల్లి 3రోజులుగా 500 నోటు పట్టుకుని రేషన్ తెచ్చుకోలేక, ఆకలితో అలమటిస్తున్న బిడ్డల్ని చూడలేక ఆత్మహత్యకు పాల్పడింది. జబ్బుపడిన బిడ్డను రవాణా లేక, బండిలో పెట్రోల్ లేక, చేతిలో రూ.100లకు చిల్లరలేక ఆస్పత్రికి తీసుకెళ్ళేప్పటికి చనిపోతే ఆ తండ్రి దు:ఖానికి మోడీ ఓదార్పు ఇవ్వగలడా? నల్ల కుబేరులు బ్యాంకుల ముందు బారులు తీరారా? పెళ్ళికోసం దాచుకున్న డబ్బు,చెత్త కాగితాలవుతాయన్న ఆవేదనతో 500, 1000 నోట్లను మార్చుకోవటానికి అష్టకష్టాలుపడేది పేదలు, మధ్యతరగతి వేతన జీవులు, చిరువ్యాపారులు తప్ప ఎవరైనా డబ్బున్న కోటీశ్వరులు క్యూలలో కన్పించారా? మోడీ తల్లి వస్తే బ్యాంకు క్యూలో దారి ఇచ్చి పంపారు. మరి 74 ఏళ్ళ వృద్ధుడు రిటైర్డ్ ఉద్యోగి క్యూలోనే చనిపోతే వృద్ధులకు ప్రత్యేక క్యూలు పెట్టాలన్న ఇంగితమైనా లేదా? లక్షిత దాడులు ఎవరిమీద? జనం మీదనా? నల్లకుబేరుల మీదనా?

మార్కెట్లు మూతబడుతున్నాయి. 1,2 రోజులలో వెల్లడవ్వాల్సిన ఉల్లి మార్కెట్‌లలో, పొలాల్లో కుళ్ళిపోతున్నాయి. సినిమా థియేటర్లలో 30% కలెక్షన్స్ తగ్గాయి. బంగారం దుకాణాలు మూతబడ్డాయి. చాయ్ బంకులు వెలవెలలాడుతున్నాయి. బ్యాంకుల్లో నో క్యాష్. ఏటియంలు నిల్. విద్యార్థులు గడువులోపు ఫీజులు కట్టలేక వేదన. విత్తనాలు, ఎరువుల ధరల పెరుగుదల వ్యవసాయానికి ఆగచాట్లు. నిత్యావసరాలు కొనుక్కోలేక, అత్యవసర ఔషధాలకు సైతం చిల్లర దొరక్క పనిలేక తిండిలేక సామాన్యుల అవస్థలు. నల్లధనం, అవినీతి, నకిలీ కరెన్సీనోట్లు, తీవ్రవాదులకు అందుతున్న నోట్లు మోడీ లక్ష్యాలట! ఇదే నిజమైతే నల్లకుబేరుల ఆస్తుల మీద చర్యలు ఎందుకు తీసుకోరు? విదేశీ కరెన్సీ రూపంలో మూలిగే నల్లధనాన్ని తెచ్చేందుకు చర్యలేవీ? విదేశీ బ్యాంకు ఖాతాల పేర్లు ఎందుకు బహిర్గత పర్చరు? 11 లక్షల కోట్లు బ్యాంకులకు ఎగ్గొట్టిన పెద్దమనుషుల పైన చర్యలెందుకు లేవు?

నల్లధనం కరెన్సీ రూపంలో ఉన్నది 6%మాత్రమే. 0.028%మాత్రమే నకిలీ కరెన్సీ. 85% చలామణిలో ఉన్న నోట్లు 500రూ, 1000రు॥లు. వాటి రద్దుతో నల్లకుబేరులకే నష్టం అని పై నుండి క్రింది దాకా బిజెపి నాయకులు లల్లాయి పాటలు పాడుతున్నారు. ఆదమరచి నిదురపోతున్నవాళ్లందరూ నల్లకుబేరులు కాదా?

ఎమోషనల్ సీన్లు పండించటం మన ప్రధానికి వెన్నతోపెట్టిన విద్య. కంటతడి పెట్టే మగవాడిని నమ్మకూడదంటారు. లెక్కకు మించిన అవతారాలలో మోడీ దర్శనమిస్తున్నాడు. ఉరితియ్యమంటాడు. మహాయజ్ఞం చేస్తున్నానంటాడు. ప్రజలను సమిధలుగా వాడుకుని యజ్ఞ ఫలాన్ని ఆరగించేందుకు బిజెపి నాయకులను సిద్ధం చేస్తాడు. లేకపోతే తామే సమిధలుగా మసి అవ్వాల్సి వస్తుందంటాడు. నిజాలు మనం గ్రహించాల్సినవి. ప్రజలను బలిచేసి, త్యాగం చేయమని ఉద్బోధించి, ఇదేమిటంటే నల్లకుబేరుల తరపున మాట్లాడుతారా అంటూ బెదిరించి, పోతున్న భ్రమలను నిలబెట్టుకునేందుకు వేసిన ఎత్తుగడ ఇది.

పేటిఎమ్, డిజిటల్ ఫైనాన్షియల్ (అదానీ, అంబానీ) సంస్థలకు నోట్ల రద్దు వరప్రసాదం. పాలకుల అనుంగు మిత్రులు ముందస్తు సమాచారంతో పనులు చక్కబెట్టుకుని హాయిగా ఉన్నారు.

“ఇవి లక్షిత దాడులు కావు. విచ్చలవిడి బాంబుదాడి” అంటూ సుప్రీమ్ కోర్టు వ్యాఖ్యానం.

బహుశా ఇది అతి పెద్ద కుంభకోణం కావచ్చు. ఉత్తరప్రదేశ్ ఎన్నికలలో ఒక దెబ్బకు రెండు పిట్టలు కొట్టేయాలనుకుని పప్పులో కాలేశాడు మోడీ. ప్రజాస్వామ్య ప్రక్రియను పక్కకునెట్టి ఏకవ్యక్తి పాలనతో నీతి ఆయోగ్ లాంటి నిరంకుశ వ్యవస్థలను మొదలుపెట్టిన మోడీ జనం మీద చేసిన క్రూరదాడి ఇది. ఈ దాడిని తిప్పి కొట్టడం ఒక్కటే మార్గం. అవినీతిపరుల భరతం పట్టే శక్తి నల్లకుబేరుల ప్రయోజనాలు కాపాడే మోడీ చేతుల్లో లేదన్నది చేదునిజం. మన నిరసనలను తెలియచేద్దాం. క్యూలైన్లను, నోట్ల ఇబ్బందులను పడటంకాక నిలదీసేందుకు పూనుకుందాం! కలాల్ని, గళాల్ని కలిపి సమరం సాగించటమే నవోదయానికి నాంది.

జీవితం అనే యుద్ధాన్ని
గెలవడానికి ధైర్యాన్ని
మించిన ఆయుధం లేదు.
-భగత్ సింగ్

# చైతన్య మానవి

## ఈ సంచికలో






**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**
**ఎ.పి. రాష్ట్ర కమిటీ**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
31-5-6, ప్రకాశరావు వీధి, మారుతినగర్
విజయవాడ.
ఫోన్, 9490098620, 9490098022
E-mail : Chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,
కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా

వ్యాసం

# గురజాడ కాంక్షించిన ఆధునిక మహిళ

- డా. కిన్నెర శ్రీదేవి

**గురజాడ వర్ధంతి సందర్భంగా..**

ఆధునిక మహిళ చరిత్రను తిరగ రాయాలని గురజాడ కాంక్షించారు. ఆధునిక మహిళ స్వరూప స్వభావాలు ఆయన సాహిత్యంలో సౌదామిని, మంజు వాణి, మధురవాణి,సరళ, నాంచారమ్మ, కమలినిలు తన ఆకాంక్షకు ప్రతిరూపంగా సృష్టించిన స్త్రీ పాత్రలు. భగవంతుని సృష్టిలో కెల్లా ఉత్కృష్టమైన వస్తువు విద్య నేర్చిన స్త్రీ రత్నమే (పే.3 దిద్దుబాటు, గురజాడ రచనలు సంపాదకులు శెట్టి ఈశ్వరరావు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 2009) అని నమ్మకంగా చెప్పారు. గురజాడ కమిలిని పాత్రతో మొదలైన ఆధునిక స్త్రీతత్వం మంజువాణి, మధురవాణి నుండి సౌదామిని పాత్రల సృష్టితో ఒక పరిణామ క్రమాన్ని సంతరించుకోవడాన్ని గమనించవచ్చు. నాంచారమ్మ సంప్రదాయ విద్యను అభ్యసించిన స్త్రీ, కమిలిని పాఠశాలకు వెళ్లి చదువుకున్న స్త్రీ. మధురవాణి సంగీత నాట్య శాస్త్రాలతో పాటు లోకాన్ని చదువుకున్న స్త్రీ, ఎవరి స్వభావం ఎలాంటిదో పసి గట్టగలిగిన నేర్పరి. ఎత్తులకు పైఎత్తులు వేయగల మేధావి. వేశ్యాకులంలో పుట్టడమే ఆ పాత్ర బలం, బలహీనత కూడా. ఇక సౌదామిని పాత్ర అచ్చంగా గురజాడ కలలుకన్న ఆధునిక స్త్రీకి ప్రతిరూపం. కన్యాశుల్కం రచనా నేపథ్యం దాదాపు వేల ఏళ్లుగా చలనం లేకుండా నిశ్శబ్దంగా ఉండేది. ఫ్యూడల్ సమాజంలో సంఘ సంస్కరణోద్యమం ద్వారా మొదలైన ఆధునిక సమాజం. ఆ సమాజం మార్పుల ఛాయలు గురజాడ స్త్రీ పాత్రల్లో కనబడతాయి. సమకాలీన సమాజం ఫ్యూడల్ యుగానికి వ్యాపార యుగానికి సంధికాలం. అందువల్ల ఆ ప్రతి ఫలన రూపాలుగా ఆయా భావజాలంలో వచ్చిన మార్పులకు అనుగుణంగా స్త్రీ పాత్రల్లో కూడా మార్పులు చోటుచేసుకు



న్నాయి. పితృస్వామిక స్వాభా వికత నుండి పురుషుడు స్త్రీల జీవితాన్ని ఎలా సాధిస్తాడో తెలియజేయడానికి వెంకమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి పాత్రలను సృజించాడు. ఈపాత్రలు సాంప్రదాయ చట్రంలో ఏదో ఒక విధంగా అణచివేతకు గురయినవే.

వెంకమ్మకు తన పిల్లల విషయంలో ఎలాంటి స్వాతంత్ర్యం లేదు. భర్త నిర్ణయాల్ని ప్రశ్నించే అధికారం లేదు. బుచ్చమ్మ,మీనాక్షి పూటకూళ్లమ్మ వితంతువులు. బుచ్చమ్మ సమాజం విధించిన కట్టుబాట్లకు లోబడి నడుచుకుంటుంది. కానీ చెల్లెలు కూడా తనలాగా వైధవ్యం అనుభవిం చాల్సిన దుస్థితిని అధిగమించడం కోసం గిరీశంతో పునర్వివాహానికి సిద్ధపడుతుంది. స్వతహాగా బుచ్చమ్మకు ధిక్కరణ స్వభావం లేదు. కానీ మీనాక్షి సమాజం విధించిన కట్టుబాట్లని ధిక్కరిస్తుంది. తనని వివాహ మాడతానని నమ్మబలికి సంబంధం కొనసాగించిన రామప్పంతులు పీక మీద కూర్చుంటుంది. మొత్తానికి తన ప్రవర్తన ద్వారా వితంతు స్త్రీల జీవితాన్ని కన్యాశుల్కం నాటకంలో సమస్యాత్మకం చేయడం ద్వారా వితంతు స్త్రీల లైంగికత్వాన్ని చర్చనీయాంశంగా చేసింది మీనాక్షి.

గురజాడ స్త్రీల పాత్రల్ని ఎంత శక్తిమంతంగా తీర్చిదిద్దాడంటే 1897లో మలికూర్పుతో వచ్చిన కన్యాశుల్కంలోని మధురవాణి, 1906లో వచ్చిన కొండు భట్టీయంలోని మంజువాణి, 1905లో సృష్టించిన సౌదామిని స్త్రీ పాత్రల శక్తి సామర్థ్యాలను 2015 నాటికి కూడా వీళ్లతో సాటిగా, ఎసర్టివ్‌గా తయారుకాలేక పోయారని చెప్పడానికి జంకాల్సిన పనిలేదు. మంజువాణినిగానీ మధుర వాణినిగానీ జయించిన పురుషపాత్రలు మన సాహిత్యంలో ఎక్కడున్నాయి? స్త్రీలను ఆయుధదారులు కమ్మని అనాడు గురజాడ ఇచ్చిన పిలుపు ఇంతవరకు స్త్రీవాదులు కూడా ఇవ్వలేకపోయారు.

**గురజాడ ఈ స్త్రీల పాత్రల్ని ఇంత శక్తివంతంగా తీర్చిదిద్దాడంటే 1897లో మలికూర్పుతో వచ్చిన కన్యాశుల్కంలోని మధురవాణి, 1906లో వచ్చిన కొండు భట్టీయంలోని మంజువాణి, 1905లో సృష్టించిన సౌదామిని స్త్రీపాత్రల శక్తిసామర్థ్యాలను 2015 నాటికి కూడా వీళ్ళతో సాటిగా, ఎసర్టివ్‌గా తయారుకాలేక పోయారని చెప్పడానికి జంకాల్సిన పనిలేదు. మంజువాణినిగాని, మధుర వాణినిగాని జయించిన పురుషపాత్రలు మన సాహిత్యంలో ఎక్కడున్నాయి? స్త్రీలను ఆయుధధారులు కమ్మని ఆనాడు గురజాడ ఇచ్చిన పిలుపు ఇంతవరకు స్త్రీవాదులు కూడా ఇవ్వలేకపోయారు.**

అగ్రకుల పురుషాధిపత్యాలను ఇంత ధీమంతతతో జయించిన స్త్రీలు ఇప్పటికీ కనిపించటం లేదు. అయితే గురజాడ వేసిన ఆధునిక స్త్రీ పాత్రల ఒరవడిని స్త్రీవాద రచయితలు కొంతవరకు అందిపుచ్చుకో గలిగారు. కానీ ఇంకా ఆ ప్రాసెస్‌ను పూర్తిచేయలేకపోతున్నారు. స్త్రీవాద రచయితలింకా అధికారికంగా పితృస్వామ్య స్వభావాన్ని తిప్పికొట్టగలిగిన పాత్రల సృజనను అందిపుచ్చుకోవల్సి ఉంది. మధురవాణి, సరళ పాత్రలకుండే స్వేచ్ఛ లైంగికతకు సంబంధించిందే కాదు. కుటుంబ చట్రంలో మెసిలే స్త్రీలకు గల ఒక పరిమితిగా గురజాడ గుర్తించారని, నాంచారమ్మ, కమిలిని పాత్రల సృజనలో కనబడుతుంది. ఈ పాత్రలు కుటుంబ చట్రంలో వుంటూనే, సంఘ సంస్కరణ ధోరణిలో తమకు వ్యతిరేకత వున్న వాటిని సానుకూల ప్రమాణాల్లో సాధించుకోగలిగారు. మధురవాణి పాత్ర పురుషాధిపత్యానికి లొంగి ఉండాల్సిన అవసరం లేని పాత్ర. కుటుంబ చట్రంలో వివాహిత స్త్రీలు పురుషాధిపత్యాన్ని ఎదిరించాలంటే, చర్చ మరో రూపం తీసుకునే అవకాశం వుంటుంది. గురజాడకు వైవాహిక వ్యవస్థ పట్ల కూడా అంత సదభిప్రాయం లేదు. మధురవాణి మా బోటోళ్ళను ఎవరు పెళ్ళాడతారు? అని ప్రశ్న వేస్తుంది. సరళ, మధుర వాణి సంధించిన బాణాలు ఆనాటి సామాజికులకే కాదు ఈనాటి సామాజికు లకు కూడా సమాధానం చెప్పలేని సవాళ్ళే.

సౌదామిని పాత్ర అచ్చంగా గురజాడ ఆధునిక స్త్రీ చరిత్రను ఎలా తిరగ రాస్తుందని కలలు కన్నాడో అలాంటి స్త్రీ వ్యక్తిత్వం అచ్చంగా, ముమ్మూర్తులా సౌదామినిదే. పురుషుడి దౌర్జన్యం నుండి ఆత్మ రక్షణ కోసం స్త్రీ కత్తిసాము నేర్చుకోవాలన్న ప్రతిపాదన, సడలించలేనంత గట్టిగా బిగుసుకుపోయిన వైవాహిక బంధాలను గురించి చేసిన చర్చ. వంటింటి చాకిరీ నుండి స్త్రీల విముక్తి, కుటుంబ ఆహార అవసరాలు తీరడానికి జరగవల్సిన ఏర్పాట్ల గురించి చేసిన ప్రతిపాదనలు గురజాడ జీవించిన కాలానికి ఊహించడానికి కూడా వీలుకానివి. శతాబ్ద కాల వ్యవధిలో ఇప్పటికి కూడా సాధించలేపోయినవి. సుదూరంలోనైనా సాధిస్తామన్న ఆశను మిగిల్చలేని సామాజిక సందర్భం గురజాడ చనిపోయి సరిగ్గా నవంబరు30,2015 నాటికి వంద సంవత్సరాలు పూర్తయింది. శ్రమలో వున్న సౌందర్యాన్ని గురజాడ దర్శించారు. శ్రమ జీవనం వలన పెంచుకునే దృఢత్వం ఆధారంగా అబలత్వాన్ని స్థిరీకరించే పితృస్వామ్య భావజాలాన్ని ఖండించారు. స్త్రీలు అబలలనే మాట అర్థంలేనిదని మనదేశంలో నిరంతరం శ్రమ చేసే రైతు కుటుంబంలోని స్త్రీ పొలంలో కునుకు పాట్లుపడే పురుషుని కంటే బలమైనది, గట్టిది, ఓపిక గలదిగా స్త్రీల శక్తిని అంచనా వేశారు. పొలంలో నాట్లు వేసేది ఎవరు? పత్తి ఏరేది ఎవరు? వడ్లు దంచేది ఎవరు? చింతపండు లోని పిక్కలు తీసేది ఎవరు? అన్ని పనులు చేసే పనిమనిషి ఎవరు? అంటూ నిజమైన శ్రామికులు స్త్రీలేనని సౌదామినిలో (అసంపూర్ణ రచనలో) రాసుకున్న అంశాల ద్వారా తెలుస్తుంది. శ్రామిక స్త్రీలు చేయలేని పనంటూ ఏదీ లేదని స్త్రీల శ్రమ విలువను ఆనాడే గురజాడ గుర్తించాడు. ఆయన కలలు కన్న ఆధునిక స్త్రీ ఆవిర్భావం జరగాలంటే, సమకాలీన సమాజంలో సంస్కరించబడాల్సిన దుస్థితిలో స్త్రీలున్నట్లు ఆయన భావించారు.

శ్రమైక తత్వాన్ని అలవరుచుకున్న స్త్రీల సౌందర్యం మరింతగా ఇనుమడించ గలదని, వాళ్ళను ఎంతో ధీరవనితలుగా ఆ శ్రమైక సౌందర్యం నిలబెట్టగలదని ఉదాహర ణపూర్వకంగా సౌదామిని రచనలో ఇలా ఆవిష్కరించారు.

శ్రమించు, శ్రమించు ఆరుబయట గాలిలో నడుస్తూ, సైకిల్ తొక్కుతూ, గుర్రపు స్వారీ చెయ్యి, కత్తిసాము లాంటి విద్యలను నేర్వాలని, (పి.నెం.88) అప్పుడే స్త్రీలు తమని తాము రక్షించుకోగలరన్నారు.

పురుషులకు బుద్ధిమాంద్యం, క్రూరత్వం వున్నాయి కాబట్టి వాటిని జయించడానికి బయటకు వెళ్ళే ప్రతీ స్త్రీకి ఆయుధం ఉండాలన్నారు. అవి రివాల్వరు, బాకు అని కూడా ప్రత్యేకంగా నొక్కి మరీ చెప్పారు. ఇవన్నీ చెయ్యాలంటే సాంప్రదాయ వంటింటి నుండి స్త్రీలు బయట ప్రపంచం లోకి రాలేకపోవడానికి వ్యక్తిగత వంటిళ్ళే ప్రధాన కారణంగా గుర్తించారు. ఆ స్థితిని అధిగమించడానికి వాటిని నిషేధించి పారేయాలని కోరుకున్నారు. స్త్రీని ఇంటి చాకిరి ఎంత వెనక్కు నెట్టివేస్తుందో ఆయనకు అవగాహన వుంది. స్త్రీలు అనుభవిస్తున్న అణచివేతకు, వేదనలకు మూల కారణంగా వ్యక్తిగత వంటింటిని పేర్కొన్నారు. వాటి పట్ల ఎంత కోపం ఉందో ఆయన ఉపయోగించిన భాషా తీవ్రతను బట్టి అంచనా వేయవచ్చు. వంట చేయడాన్ని నిషేదించిపారేయాలి (పే.86) అన్న పదంలోనే తెలుస్తుంది. మామూలుగా అయితే 'వంట చేయడాన్ని నిషేధించాలి' అంటే సరిపోతుంది. కానీ 'నిషేధించి పారేయాలి' అన్న పద ప్రయోగంలో వ్యక్తమయ్యే వత్తిడి (స్ట్రెస్) అతని కంఠ స్వరాన్ని పట్టిస్తుంది. స్త్రీల పట్ల రచయితకు గల అమిత శ్రద్ధను తెలియ జేస్తుంది. విమల రాసిన వంటిల్లు కవితలో ఒంటరి వంటగదులు కూల్చేందుకు రండి వేరు వేరు సొంత పొయ్యిలను పునాదులతో సహా తవ్విపోద్దాం రండి అని విమల 1990లలో స్త్రీవాద ఉద్యమ ప్రభావంతో సోషలిస్టు భావాల నేపథ్యంలో నుండి, ఈనాటి స్త్రీవాద సామాజిక ఉద్యమ ప్రభావ ఫలితంగా ఏర్పడిన సాహిత్య ప్రతిఫలనాల నుండి పిలుపునిచ్చింది. తెలుగు సాహిత్యంలో మొట్టమొదటిసారిగా వంటింటి చాకిరీని నిషేదించాలి అని గురజాడ చేసిన ప్రతిపాదనల నుండి పిలుపు నిచ్చింది. తెలుగు సాహిత్యంలో మొట్ట మొదటిసారిగా వంటింటి చాకిరీని నిషేధించాలి అని గురజాడ చేసిన ప్రతిపా దనల మూలాలు నేటి సోషలిస్టు స్త్రీవాదుల ప్రతిపాదనలలో చోటుచేసుకున్నాయని చెప్పడానికి ఎలాంటి సందేహం లేదు.

వంటను నిషేధించడమంటే, వంటింటి సంస్కృతిని నిషేధించడం. మరింత లోతుగా, స్పష్టంగా చెప్పాలంటే పితృస్వామ్యాన్ని నిషేదించడం. ఒకానొక చారిత్రక క్రమంలో ఆడవాళ్లను ఇంటి పనులకు పరిమితం చేసి, మగవాళ్లు సామాజిక ఉత్పత్తి కార్య కలాపాలను తమవిగా చేసుకున్నారు. వంటపనిని స్త్రీలు మాత్రమే చేసే పనిగా చూస్తుంది పురుషాధిపత్య సమాజం. స్త్రీలకు 'వంట'ను తన కర్తవ్యంగా భావించాల్సిన విషయమని, స్త్రీలు దాన్ని ఏమాత్రం మరచిపోనీకుండా గుర్తుచేస్తుంది. పితృస్వామిక సంస్కృతి. స్త్రీలు ఉత్పత్తి రంగంలోకి రాకపోవడానికి ప్రధానకారణం వంట పని, ఇంటి పని స్త్రీలదే కావడం. స్త్రీలు చేస్తున్నందు వలన అవి హీనమైన పనులుగా పరిగణించడం. అలా స్త్రీల మొత్తం జీవిత విషాదానికి వంటింటి చాకిరిని అనుసంధానించి చెప్పడంలోనే గురజాడ తాత్విక దృక్పథం దాగివుంది. వంటతో ముడిపడిన స్త్రీల జీవిత సంకెళ్ళకు చరమ గీతం పాడటమే స్త్రీల విముక్తి మార్గంగా గురజాడ కాంక్షించాడు.

వంట నిషేధం పరోక్షంగా ఇది సొంత ఆస్థి లేని సమాజాలలో నిర్మించుకొనే ఉద్యమాలలోకి స్త్రీలను ఆహ్వానించడం. విప్లవానంతర కమ్యునిస్టు సమాజాలలో సొంత ఆస్థి రద్దవుతుంది. కనుక కుటుంబ జీవితంలోని వ్యక్తిగత లక్షణం కూడా క్రమంగా తగ్గుముఖం పడుతుంది. శ్రమ సామాజీకరించ బడుతుంది. స్త్రీలకు ఉత్పత్తి కార్య కలాపాలలో సమాన భాగస్వామ్యానికి అవకాశాలు కూడా ఏర్పడాలన్న అకాంక్ష గురజాడకు వుంది. దుకాణం నుంచి ఆహారం తెచ్చుకోవాలి దాన్ని వెచ్చ బెట్టడానికి అవసరమైన సామాగ్రిని కూడా తమతో ఉంచుకోవాలని ప్రతిపాదించాడు. పైగా దుకాణాలలోనే వంట బాగుంటుందని సర్టిఫై చేస్తారు. ఇంకా, ప్రతివీధికి ఒక దుకాణం వుండాలి. మొత్తం అక్కడకు వెళ్ళి భోజనం చేయాలంటారు.

స్త్రీల జీవితం వంటింట్లో మగ్గిపోరాదని ఆకాంక్షిస్తున్నారు. సమిష్టి శక్తి గురించిన జ్ఞానాన్ని ప్రపంచంలోని ప్రజాస్వామిక ఉద్యమాలు ఇవాళ స్త్రీలకిస్తున్నాయి. వంటింటి విధ్వంసాన్ని కోరుకున్న స్త్రీలకు, వంటింటిని నిషేధించాలని కోరుకున్న గురజాడకు స్త్రీల విముక్తి పట్ల గల సమాన బాధ్యతను ఈ భావ సారూప్యతకు ఈ వ్యక్తీకరణ ఎత్తి నడుతుంది. తరతరాల చరిత్రను తిరగ రాయాల్సిన ఆవశ్యకతను గురజాడ గుర్తించారు. స్త్రీల బాధల పట్ల సానుభూతిని చూపించి, తన చైతన్యాన్ని స్పష్టపరిచి, తన తరువాతి తరం కోసం కృషి చేయడానికి తాను సిద్ధమవుతూ తనబోటి

**తెలుగు సాహిత్యంలో మొట్టమొదటిసారిగా వంటింటి చాకిరీని నిషేధించాలి అని గురజాడ చేసిన ప్రతిపాదనల నుండి పిలుపు నిచ్చింది. తెలుగు సాహిత్యంలో మొట్ట మొదటిసారిగా వంటింటి చాకిరీని నిషేధించాలి అని గురజాడ చేసిన ప్రతిపాదనల మూలాలు నేటి సోషలిస్టు స్త్రీవాదుల ప్రతిపాదనలలో చోటుచేసుకున్నాయని చెప్పడానికి ఎలాంటి సందేహం లేదు.**

సామాజికులను కూడా సంసిద్ధం చేస్తున్న క్రమంగా గుర్తించాల్సి వుంటుంది. నాలుగో తరం స్త్రీలు ఆ బాధలను అధిగమించి ఆధునిక స్త్రీగా తరతరాల చరిత్రను తిరగ రాయాల్సిన ఆవశ్యకతను గురజాడ గుర్తించారు. ఆయన ఆకాంక్షించిన ఆధునిక స్త్రీ నాలుగో తరానికి చెందింది. ఆ నాలుగో తరం స్త్రీలకు ప్రతి బంధకాలైన ప్రధానాం శాల్లో మొదటిది వంటను నిషేధించడమైతే, రెండోది వైవాహిక జీవితం. వైవాహిక వ్యవస్థలో గల ప్రజాస్వామిక సంబంధాల స్థానంలో నిజమైన ప్రేమ సంబంధాలు నెలకొల్పాల్సిన అవసరాన్ని ఆయన గుర్తించారు. అసలు ప్రేమంటే ఏమిటి? వివాహం అంటే ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలు ఈ అసంపూర్ణ సుందర కావ్యం సౌదామినిలో చర్చించారు.

ప్రకృతి విరుద్ధంగా స్త్రీలు తయారు చేయబడిన క్రమాన్ని గురజాడ గుర్తించారు. జన్మతఃనీలో స్వేచ్ఛా సంప్రదాయాలున్నాయి. నువ్వు వివాహం చేసుకొని నిన్ను నువ్వు మరొకరికి ఎందుకు అమ్ముకోవాలి? (పేజీ నెం.88, సౌదామిని గురజాడ రచనలు, కథానికలు, సంపాదకులు శెట్టి ఈశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్ ఫిబ్రవరి,2009) అని ప్రశ్నించిన గురజాడ వివాహం చేసుకో దలిస్తే ఎలాంటి వాళ్లను పెళ్లాడాలో కూడా చెప్పారు. స్త్రీల శారీరక సౌందర్యం కంటే నీకళ్లలోనే, నీ జీవితంలో ఎక్కువ సౌందర్యం చూడగల పురుషుణ్ని వివాహమాడాలి అంటారు. ఎంత అద్భుతమైన మాట జీవిత భాగస్వామిని ఎంచుకొనే క్రమంలో స్త్రీలు ఎంచుకొనే వైవాహిక శాశ్వత బంధానికి కావాల్సిన ప్రతిపత్తి ఎలా కాపాడబడుతుందో చర్చించారు. నిజంగా హృదయం, మెదడు గల భర్త దృష్టిలో మాత్రం భార్య సౌందర్యం ఎన్నటికీ తరిగిపోదంటారు. యుక్తవయసులో యువతీ యువకులు వివా హమాడినప్పుడు ఆమె అందం కేవలం శారీరకమైనది. కాల చక్రం కదిలేకొద్దీ వాళ్ల కలయికలు, జీవిత బంధాలు, బిడ్డలు ఉమ్మడి ఆనందాలు, దు:ఖాలు, ప్రేమలు అధికంగా లేకపోవచ్చు కానీ ఆమె భర్త యెడల చూపే సహజమైన ఆపేక్ష ఇవన్నీ తగిన స్థానాన్ని భర్తీ చేస్తాయి. కళ్లల్లో తగ్గిన కాంతి స్థానాన్ని పూరిస్థాయి అన్న భరోసా కూడా వైవాహిక బంధంలోనే ఉందంటారు. ఈ భరోసానే స్త్రీవాదులు సహజీవనంలో (లివింగ్ టు గెదర్) కోరుకుంటున్నారనిపిస్తుంది.

ఇంకా సౌదామినిలో ఒకచోట స్త్రీలు పుష్పిస్తున్న వృక్షాల్లాంటి వారంటారు. సమకాలికులకంటే భిన్నంగా స్త్రీలను వృక్షంతో పోల్చడం స్త్రీల దృఢత్వానికి, పుష్పిస్తున్న వృక్షాలుగా పోల్చడం ప్రాధత్వానికి, హృదయ సౌకుమార్యానికి, విస్తరిస్తున్న వికాసానికి ప్రతీకగా నిలుస్తుంది. మొత్తానికి స్త్రీలను హృదయ సౌందర్య ధీరవనితలుగా చూడగలగడం ఆయనలోని ప్రగతి కాముక భావజాలానికి నిదర్శనంగా భావించొచ్చు. బలవంత ఆధిపత్యాలను నిరసించే స్త్రీ పాత్రలను కూడా గురజాడ అప్పారావు సృజించారు.

పుత్తడిబొమ్మ పూర్ణమ్మ., కావ్యంలోని పూర్ణమ్మ బలవంతంగా తనపై అమలు చేయాలనుకున్న ఫ్యూడల్ సంప్ర దాయ ఆధిపత్యాన్ని అంగీకరించకుండా ప్రాణ త్యాగం చేస్తుంది. ఈ కావ్యాల్లోని స్త్రీ పాత్రలు సంప్రదాయ భూస్వామిక కుటుంబ చట్రాల్లో ఉండటం వలన ఆత్మాహుతుల ద్వారా తమ నిరసనను తెలియజేస్తారు.

అందుకే స్త్రీలు కత్తిసాము నేర్వగలిగిన సాహసిగా ఉండగలగాలని అప్పుడే తమను తాము రక్షించుకోగలరంటారు గురజాడ. తనను ఎత్తుకుపోవడానికి ప్రయత్నించిన జమిందారును ఆత్మరక్షణార్థం సౌదామిని అతన్ని కత్తితో పొడిచేస్తుందని చిత్రించారు. వైవాహిక జీవితంలో భర్త అసమర్థుడైతే అనే ప్రశ్న వచ్చినప్పుడు ఈ సమస్యపై సాధికారి కంగా ఏమీ చెప్పలేను. స్త్రీ ఏమనుకుంటుందో నేనెలా చెప్పగలను? అంటారు. స్త్రీ సమస్య లకు స్త్రీలే పరిష్కారాలు వెతుక్కోవాలన్న గురజాడ కాంక్షే ఆధునిక స్త్రీత్వానికి పునాదిని ఏర్పరుస్తుంది. ఆ భావ వైశాల్య సామర్థ్యమే ఆధునిక స్త్రీగా ఆమె పొందాల్సిన లక్షణం అనేది ఆయన సంకల్పం.



వ్యాసం

# సుప్రీం తీర్పు సమంజసం కాదు తల్లి దండ్రుల సంరక్షణ ఇద్దరిదీ...

- పసుపులేటి రమాదేవి



మన కోర్టులు కొన్నిసార్లు క్లిష్టమైన తీర్పులు ఇస్తుంటాయి. తాజాగా సుప్రీం కోర్టు కర్నాటక దంపతుల కేసులో విడాకులకు సంబంధించి ఇచ్చిన తీర్పులో భార్య గనుక వేరే కాపురం పెట్టాలని పట్టుబడితే భర్త విడాకులు ఇచ్చేయొచ్చని చెప్పింది.

హిందూ కుటుంబాల్లో వృద్ధ తల్లిదండ్రుల సంరక్షణ కొడుకుల 'పవిత్ర మైన' బాధ్యత అని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.

హిందూ కుటుంబంలో కుమారుడు తల్లిదండ్రుల బాధ్యత చూడాలని, ఒక్కడే కుమారుడైతే అతని జీతంలో వారికి హక్కు ఉంటుందని పేర్కొంది. అలాంటి పరిస్థితి లో కలిసి ఉండేందుకు భార్య ఒప్పుకో పోతే భర్త విడాకులు తీసుకోవచ్చని జస్టిస్ అనిల్ ఆర్.దావే, జస్టిస్ ఎల్.నాగేశ్వర రావులతో కూడిన ధర్మాసనం తీర్పు నిచ్చింది. వివాహం తర్వాత భర్త కుటుం బంలో భార్య భాగమై పోతుందని, భర్త ఆదాయాన్ని అనుభవించ డానికి, భర్తతో వేరు కాపురం పెట్టించడం కుదరదని, అలా చేయడం భర్త పట్ల క్రూరంగా వ్యవహరిం చడంగా పరిగణించాల్సుంటుందని పేర్కొంది. భార్య ఆత్మహత్యకు ప్రయత్నిం చడం లేదా ఆత్మహత్య చేసు కోవడం వల్ల భర్త మానసిక వ్యధకు గురవుతాడని పేర్కొంది. అయితే భార్య ఆత్మహత్యకు ప్రయత్నించడానికి దారితీసిన పరిస్థితుల గురించి ప్రస్తావన లేదు.

బీబీసీలో వచ్చిన ఒక కథనం ప్రకారం భారతదేశంలో మహిళల ఆత్మహత్యలకు ముఖ్య కారణం వివాహం తర్వాత ఆమె ఆకాంక్షలకు తగిన జీవితం లభించక పోవడమే.

తల్లిదండ్రులను చూసుకోవడం, వేరుకాపురం పెట్టకపోవడం కుమారుడిగా భర్త సదాచరణలుగా భావించడం బాగానే వుంది. కానీ, అదే సూత్రం భార్యకు ఎందుకు వర్తించదు? భార్య తన స్వంత తల్లి దండ్రులను చూసుకోవడం కూడా ఆమెకు సంబంధించిన సదాచరణకాదా?

భర్త తన తల్లిదండ్రులతో కలిసి ఉండడాన్ని, వారిని ఆదుకోవడాన్ని భార్య అంగీకరించక పోతే వేరు కాపురం కావాలని కోరితే భర్తకు విడాకులిచ్చే హక్కు ఉందనడం ఆందోళనకరమైన విషయమే. మహిళలను రెండో తరగతి పౌరులుగా భావించడం తప్ప మరేమీ కాదిది.

సాధారణంగా పెళ్లి తర్వాత భర్త కుటుంబంతో భార్య కలిసి ఉండాలి, కుమారుడు తన తల్లిదండ్రులను చూసుకోవడం హిందూ సమాజంలో సాధారణమనీ, భర్త ఆదాయం తాను అనుభవించాలని హిందూ మహిళ కోరడాన్ని హైకోర్టు సమర్ధించింది. కానీ అది చెల్లదనీ, హిందూ కుమారుడి సదాచార విధులకు అది విరుద్ధమని సుప్రీం కోర్టు పేర్కొంది. భర్త కుటుంబంలో భార్య అంతర్భాగం కాబట్టి ఆమే వేరుకాపురం కావాలనడం అనుచితం అని అభిప్రాయ పడింది.

ఈ అభిప్రాయాలు పరిశీలిస్తే స్త్రీలు, పురుషులు సమానం కాదని, పురుషుల కన్నా స్త్రీలు తక్కువన్న మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తున్నాయి. కుటుంబంలో మహిళలు నిర్వర్తించే విధులను బట్టి మంచి భార్య, మంచి కుమార్తె, మంచి తల్లి వగైరా బిరుదులు ఇవ్వడానికి ఉద్దేశించిన కట్టు బాట్లను చెబుతున్నాయి. అంతేకాదు, భర్త మానసిక ప్రశాంతతకు ఎలాంటి భంగం కలగకుండా జాగ్రత్తగా భర్త కుటుంబంలో భాగమై పోవాలన్న ఆంక్షలు పెడుతున్నాయి.

మహిళ అంటే కేవలం ఒక భార్య, తల్లి, కుమార్తె, చెల్లి, అక్క వగైరా పురుషుడికి సంబంధించిన పాత్రల చట్రంలోనే ఇరికిస్తున్నారు.

వివాహం తర్వాత భార్యగా భర్త జీవితంలోకి స్త్రీ వస్తుందన్న భావన ఉందేకానీ వివాహం ద్వారా ఆడ, మగ సమాన స్థాయిలో కలిసి ఉండడానికి నిర్ణయించుకున్నారన్న భావన లేదు.

తన తల్లిదండ్రులకు భార్య సేవ చేయడం లేదని, తల్లిదండ్రుల బాగోగులు తనను చూడనీయడం లేదని వేరు కాపురం కోసం ఒత్తిడి చేస్తుందంటూ భర్త ఆరోపించడానికి, విడాకులిస్తామంటూ బెదిరించడానికి, భార్యను వేధించడానికి ఈ తీర్పు ఉపయోగపడే అవకాశాలున్నాయి.

కుటుంబ వ్యవస్థ సమాజానికి చాలా అవసరమన్నది కాదనలేని నిజం. కుటుంబాన్ని కాపాడ్డానికి వ్యక్తిగత హక్కులను అవసరమైతే వదులుకోవడం అనేది స్త్రీ,

**భార్య, భర్తల మధ్య సంబంధం పరస్పర గౌరవాదరాలు, ప్రేమాభిమానాల పునాదులపై ఉండాలేకాని, విధులు, బాధ్యతలు, అధికారాలు, హక్కులచట్రంలో బిగించడం మంచిదికాదు.**

పురుషులు ఇద్దరి విషయంలోను న్యాయబద్ధంగా ఉండాలి.

పెళ్లయిన తర్వాత దంపతులది ప్రత్యేక కుటుంబం అవుతుంది. కానీ భర్త కుటుంబంలో దంపతులిద్దరూ అంతర్భాగం అయిపోవాలని వాదిస్తే భార్య కుటుంబంలో ఎందుకు అంతర్భాగం కారాదన్న ప్రశ్న సహజంగానే వస్తుంది.

భార్య, భర్తల మధ్య సంబంధం పరస్పర గౌరవాదరాలు, ప్రేమాభిమానాల పునాదులపై ఉండాలేకాని, విధులు, బాధ్యతలు, అధికారాలు, హక్కులచట్రంలో బిగించడం మంచిదికాదు.

అసలు మన రాజ్యాంగంలో స్త్రీ, పురుషులు ఇద్దరికీ సమానమైన హక్కులు ఉన్నాయి అంటూనే వృద్ధులైన తల్లిదండ్రుల సంరక్షణా బాధ్యత కొడుకుల పవిత్రమైన బాధ్యత అని సుప్రీంకోర్టు తీర్పు చెప్పటంలో అర్థం, మరి అమ్మాయిలకు వాళ్ల వృద్ధ తల్లిదండ్రుల సంరక్షణా బాధ్యత వారికి ఉండదా?

అంటే ఒక రకంగా ఇప్పుడు జరుగుతున్న దారుణమైన పరిస్థితికి అంటే అమ్మాయిలను పుట్టకుండానే భ్రూణ హత్యలు చేస్తున్నారు. మరి ఈ తీర్పు దానిని ఇంకా ఎక్కువగా ప్రేరేపించినట్లే కదా?

అబ్బాయిలకు మాత్రమే తల్లి దండ్రులను చూసుకునే బాధ్యత వుందని చెప్పడం పరోక్షంగా అమ్మాయిలు వద్దూ అనుకునే విధంగానే ఉంది.

ఈ తీర్పులో భార్యకు మాత్రమే విడాకులిచ్చి పంపేయాలనడం ఎలా సమర్థనీయమవుతుంది?

పరస్పర అవగాహన పెరిగేలోగా ఎవరైనా అలా భావిస్తే నేరమేమీ కాదు. తప్పులు ఎటైనా ఉండొచ్చు, గనుక నచ్చ చెప్పవలసిన బాధ్యత ఉంటుంది. కాబట్టి ఉమ్మడి కుటుంబం కోసం దంపతులను విడదీయడం కూడా పొరబాటే అవుతుంది.

ముసలి తల్లిదండ్రులను వదిలేయడం, లేదా వారి నుంచి వేరు పడడం లేదా వారిని పట్టించుకోపోవడం అనేది కూడా సమాజానికి మంచిది కాదు. కానీ ముసలి వారయిన భర్త తల్లిదండ్రులు కాని, భార్య తల్లి దండ్రులు కానీ వారిని చూసుకునే బాధ్యతను కచ్చితంగా నిర్దేశించే చట్టాలు కావాలి.

తల్లిదండ్రులను చూసుకునే బాధ్యత ఆడపిల్ల అయినా, మగపిల్ల వాడు అయినా అదివారి నైతిక బాధ్యతగా గుర్తించబడాలి.

అసలు ఒక అమ్మాయి, అబ్బాయి వివాహం చేసుకోవటం అంటే కేవలం అది వారి ఇద్దరికే సంబంధించిన విషయం కాదు. ఇద్దరి కుటుంబాలకు సంబంధించిన విషయం. కాబట్టి ఇరు కుటుంబాలను కలిపి సమిష్టి కుటుంబంగా భావించి ఇద్దరి తల్లిదండ్రులను ఇద్దరూ బాధ్యతగా చూసుకోగలగాలి.



మణిపూసలు

# భానుమతీ రామకృష్ణ

- వకుళాభరణం లలిత

భానుమతి రామకృష్ణ నటనలో అగ్రగణ్యురాలు. ఆమె గాత్రం, సంగీతం దక్షిణదేశ కళా ప్రియులందరినీ అలరించాయి. స్త్రీలు సినిమా రంగంలో ప్రవేశించటం అరుదైన కాలంలోనే భానుమతి "స్వర్గసీమ" చిత్రంలో "ఓహోహో పావురమా" అనే పాట తెలుగు సినిమా సంగీతంలో కొత్త ఫక్కీలో ఉండేది. సినిమా పాటల గూర్చి మాట్లాడేప్పుడు స్వర్గసీమ ముందరిదా వెనకటిదా అని లెక్కపెట్టుకోటం పరిపాటి అయింది. నటనతోనే గాక సంగీతంలో కూడా భానుమతి ప్రత్యేకతను సాధించారు. అంటే భానుమతి ప్రతిభ నటనతో ఆగిపోలేదు. తన మేథతో, సౌందర్యంతో సంగీతంతో తెలుగు ప్రేక్షకులను సమ్మోహనపరచగల శక్తి చాలా కొద్దిమంది కళాకారులకు మాత్రమే ఉంది. అందులో భానుమతి విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించుకున్నారు.

భానుమతి జన్మస్థానం ప్రకాశం జిల్లా. తండ్రి బొమ్మరాజు వెంకటసుబ్బయ్య. సంగీతప్రియుడు. తల్లి నృత్యంలో, నటనలో ఆరితేరిన వ్యక్తి. ఇరువురి కళాకారుల కళాభివేశం కూడా భానుమతికి సంక్రమించింది. అంతేకాదు, ఆమె రచయిత్రి తండ్రి బాల్యంలోనే భానుమతి తన స్నేహితుడు, దర్శకుడు సి. పుల్లయ్యకు పరిచయం చేశాడు. పుల్లయ్య గారు భానుమతిని ఆమె పదమూడో ఏటనే సినిమా రంగానికి పరిచయం చేశాడు. 'వర విక్రయం' ఆమె మొట్టమొదటి సినిమా. తర్వాత ఆమె నటించిన సినిమాలు వివిధ భాషల్లో 100పైనే ఉన్నాయి. ఆమె పాటే కాదు, సంభాషణలు చెప్పే



తీరు, ఆమె ధరించిన పాత్రలు మరపునకు రానీకుండా చేస్తాయి. సంగీతంలో కూడా సాహిత్యాన్ని స్పష్టంగా, భావయుక్తంగా పలుకుతూ పాటలో నృత్యానికి, అభినయానికి అనుకూలంగా ఉన్న తాళాన్ని తన స్వర మాధుర్యంతో పలికిస్తూ పాడుతారు. అందుకే ఆమె పాటలకున్నంత మంది అభిమానులు మరొకరికి ఉండబోరు. మల్లీశ్వరిలో "మనసున మల్లెలమాల లూగెనే'అనే పాట జగద్వితం. 'అంతస్తులు'లో 'దులపర బుల్లోడా'అనే పాట కూడా నృత్యంతో ఆమె ప్రత్యేకతను చాటుతుంది. 'మంగమ్మగారి మనవడు'లో చేతికర్రను తిప్పే పద్ధతిలో ఆమెకామేసాటి. ఎక్కడా ఎవరికీ తల ఒగ్గదు. తన స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొని ఎంతో అభిమానంతో నటించే శక్తి, సమర్ధత భానుమతి సొంతం.

ఆమె రామకృష్ణను వివాహం చేసుకుంది. ఆయన గొప్ప దర్శకుడు. ఎడిటర్. నిర్మాత. వారిద్దరి సాహచర్యంతో ఎన్నో అరుదైన సినిమాలు తెలుగు ప్రేక్షకులకు అలరించాయి. వాళ్ల సంస్థ భరణి చిత్రాలు అపురూపమైనవిగా పేరు పొందాయి. 'లైలామజ్ను', చండీరాణి, విప్రనారాయణ, బాటసారి, చక్రపాణి, అగ్గిరాముడు మొదలైన చిత్రాలు భారతీయ చిత్రాల్లోనే ఎన్నదగ్గవి.

సినీ నిర్మాణంలో కానీ దర్శకత్వంలో గానీ నటనలో గానీ ఆమె అందుకున్న అవార్డుల సంఖ్య అసంఖ్యాకం. ఉత్తమ నటిగా మూడుసార్లు జాతీయ అవార్డులు పొందారు. రెండు తమిళ చిత్రాలకు, పల్నాటి యుద్ధంలో భానుమతి నటనకు జాతీయ అవార్డులు లభించాయి. నటనా వ్యాకరణమని ఆమెను అన్నారు దురై

భానుమతి నటించిన సినిమాలు వివిధ భాషల్లో 100పైనే ఉన్నాయి. ఆమె పాటే కాదు, సంభాషణలో పాల్గొనే తీరు, ఆమె ధరించే పాత్రలు మరపుకు రానీకుండా చేస్తాయి. సంగీతంలో కూడా సాహిత్యాన్ని స్పష్టంగా, భావయుక్తంగా పలుకుతూ పాటలో నృత్యానికి, అభినయానికి అనుకూలంగా ఉన్న తాళాన్ని తన స్వర మాధుర్యంతో పలికిస్తూ పాటతారు. అందుకే ఆమె పాటలకున్నంత మంది అభిమానులు మరొకరికి ఉండబోరు.

సత్కరించారు. భానుమతిని తమిళ అభిమానులు అష్టావధానిగా ఎంచుకుంటారు. ఈ విధంగా స్వర్గసీమతో ప్రారంభమై, మల్లీశ్వరిలో అత్యద్భుతంగా రాణించి, విప్రనారాయణలో సంగీత దర్శకత్వం కూడా వహించి ఎంతో ఆదరణ పొందారు.

భానుమతి మంచి రచయిత్రి. భానుమతి 'అత్తగారు'రచన అద్భుతం. హాస్యపూరితమైన రచనలు చేయటంలో ఆమెకు ఆమే సాటి. 1966లో భానుమతిని భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదుతో, 2001లో పద్మభూషణ్ బిరుదుతో గౌరవించింది. ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వ విద్యాలయాలు గౌరవ డాక్టరేటును ఇచ్చి ఆమె ప్రతిభను చాటారు. భక్త ధ్రువ మార్కండేయ అనే బాలల చిత్రాన్ని తన దర్శకత్వంలో నిర్మించి 1965–70 సంవత్సరాల మధ్య చిల్డ్రన్ ఫిల్మ్ సొసైటీలో సభ్యురాలయ్యారు.

సాహిత్య రంగంలో కథా రచయిత్రిగా తెలుగు పాఠకులు భానుమతిని ఎంతగానో అభిమానించారు. అత్తగారంటే భయపడే ఆడపిల్లలకు కోడల్ని ప్రేమించే అత్తగారిగా ఆమెను చిత్రించారు. 'నాలో నేను'అనే ఆత్మకథ కూడా ప్రచురించారు. దానికి జాతీయ అవార్డు లభించింది. అసాధారణ ప్రతిభా వంతురాలిగా ఆంధ్రులు మర్చిపోలేని మేటినటి భానుమతి. నటనలో, సంగీతంలో, సినీ నిర్మాణంలో, సంగీత దర్శకత్వంలో, రచయిత్రిగా ఆమె ప్రతిభాపాటవాలు మరొకరికి లేవనటం అతిశయోక్తి కాదు. ఇటీవలి వరకూ వేసిన పాత్రలన్నీ ఆమె నటనకు మచ్చు తునకలే.

# 'సరికొత్త ఉదయం'

– ఆర్.దుర్గా ప్రసన్న

ప్రతిరోజూ
రాలి పోయే పుష్పాలు
అయినా కొత్త మొగ్గలు–
మళ్ళీ రేపు వికశించడానికి సిద్ధం!

ఎప్పటికప్పుడు
ఫలాలు, తొడిమల
నుండీ వేరు పడినా
మళ్ళీ మళ్ళీ కొత్త చిగుళ్ళు!
కొత్త కొత్త పిందెలు సిద్ధం!!

తరూలతలు క్రొత్తదనంతో
ప్రకృతి నియమాలతో సాగిపోతూ...
సరికొత్త శోభాలంకృతమే!
కాని–

స్నేహితులు మాటాడలేదనో...
బంధువులు పలకరించలేదనో...
రెక్కలు వచ్చిన పిల్లలు
ఎగిరి...పోతూ ఉన్నారనో...
మనిషి మనసుకి ఎప్పుడూ కలవరమే!
మనసు లేని మమతల కోసం
మనిషి కెప్పుడూ ఆరాటమే!!

సీరియల్ మరో అమ్మ (మేరీ జోన్స్ ఆత్మకథ)

# ఈ రోజు గాడిదలు కూడా సమ్మెలోకి వచ్చాయి....



లాటిమర్ గనిలో యూనియన్ పెట్టడం అసాధ్యంగా ఉంది. గత సమ్మెలలో 26 మంది ఆర్గనైజర్లు, కార్మికులు హత్య చేయబడ్డారు. వీరిలో కొంతమందిని వెనక నుండి కాల్చి చంపారు. ఆ రహదారులన్నీ కార్మికుల రక్తంతో తడిశాయి. లాటిమర్ వెళ్లడానికి ఎవ్వరూ సాహసం చేయడం లేదు.

ఒక రాత్రి అక్కడకు వెళ్లాలని నిశ్చయించుకున్నాను. అయితే విషయం ఎవరికీ చెప్పలేదు. పాంథర్ క్రీక్‌లోఉన్న కోల్‌డేల్‌లో మహిళల దాడి తరువాత, లాటిమర్ గని జనరల్ మేనేజర్ 'నువ్వు లాటిమర్ వస్తే, తిరిగి శవంగా వెళ్తావు', అని బెదిరించాడు. అయినా నేను జంకలేదు. సమ్మెలో ఉన్న కొంత మంది కార్మికులను పాంథర్ క్రీక్‌లో ఉన్న మూడు వేరు వేరు క్యాంపుల నుండి లాటిమర్‌కు వెళ్లే జంక్షన్ దగ్గరికి తీసుకు రమ్మని ఒక కార్యకర్తను పంపించాను. అక్కడ వారిని నా మహిళా సైన్యంతో కలిశాను.

మేము రాత్రంతా నడిచి తెల్లవారుతుందనగా లాటిమర్‌కు చేరుకున్నాము. సమ్మెలో ఉన్న కార్మికులు గనుల్లో ఉండిపోయారు. మహిళలు ఆ స్థానం భర్తీ చేశారు. వారు గని కార్మికుల ఇళ్ల, ముందు కాచుకుని కూర్చున్నారు. ఒక గని కార్మికుడు పనిలోకి వెళ్లడానికి బయటకు రావడం తోనే మహిళలు బూజుకర్రలతో నేలని కొడుతూ "ఈ రోజు పని లేదు" అని గట్టిగా అరిచారు.

అందరూ పరిగెట్టుకుంటూ మురికి రోడ్ల పైకి వచ్చారు. "దేవుడా, ఇది ముసలి అమ్మ, ఆమె సైన్యం చేసిన పని" అని అందరూ చెప్పుకుంటున్నారు.

లాటిమర్ గని కార్మికులు, కంచర గాడిదలను తోలేవాళ్లు సమ్మె చెయ్యడానికి భయపడ్డారు. వాళ్లు కంచరగాడిదలను తీసుకొని, వాళ్ల టోపీల మీద లైట్లను వెలిగించి, గనిలోపలకి వెళ్లారు. అయితే లోపల 3వేల మంది గని కార్మికులు కంచర గాడిదలతో సహా వాళ్ల కోసం ఎదురు చూస్తున్నారన్న విషయం వాళ్లకు తెలీదు.

నేను అక్కడే వున్న జనరల్ మేనేజర్‌తో ఆ 'కంచరగాడిదలు కూడా ఈ రోజు సమ్మెలోకి వస్తాయి. వాటికి ఈ రోజు శెలవు కాబోతోందన్న విషయం తెలుసునని' అన్నాను. కంచరగాడిదలను లోపలికి తీసుకువెళ్లండి' అని జనరల్ మేనేజర్ గట్టిగా అరిచాడు.

కంచరగాడిదలు,వాటిని తోలేవాళు, కార్మికులు గని లోపలకు వెళ్ళారు. లోపలకి వెళ్లిన వాళ్ల అరుపులు బయటకు వినిపించకుండా వుండేందుకు, మహిళల చేత దేశభక్తి పాటలు పాడిస్తూ అక్కడే ఉంచాను.

కొంచెం సేపటికి మొదటగా కంచర గాడిదలు మాత్రమే బయటకు వచ్చాయి. వాటిని చూడగానే మహిళలు సంతోషించారు. అవే యూనియన్‌లో చేరిన మొట్టమొదటి 'బుద్ధిమంతులు'. వాటి వెనకాలే గనికార్మికులు బయటకు వచ్చారు. ఇళ్లకు పరిగెత్తారు. ఎవరైతే పనికి వెళ్లకుండా సమ్మె చేస్తామన్న వాళ్లను బయటకు పంపించారు. సమ్మెను విచ్ఛిన్నం చేసి పనికి వెళ్తామని పట్టుబట్టిన వాళ్లను మా మహిళలు, వాళ్ళ భార్యల వద్దకు ఈడ్చుకు పోయారు.

ఒక వృద్ధ ఐరిష్ మహిళకు ఇద్దరు కొడుకులు. వాళ్ళిద్దరూ స్కాబ్స్. వారిలో ఒకరి పేరు మైక్. మా మహిళలు మైక్‌ని ఇంటి దడి పైకి తోసారు. అతను అలాగే పడి ఉండిపోయాడు. అతని తల్లి, అతను చనిపోయాడనుకొని ఇంట్లోకి పరిగెత్తుకెళ్లి ఒక సీసాలో ఉన్న పవిత్ర జలాన్ని తీసుకొచ్చి మైక్ మీద చల్లింది.

'దేముడా! నా కొడుకును బతికించు' అని పెద్దగా ఏడ్చింది.

'బతికిరా, యూనియన్‌లో చేరు' అని నా మహిళా సైన్యం చుట్టూ చేరి అరిచారు. అతను కళ్లు తెరిచాడు. మా వైపు చూశాడు. యూనియన్‌లో చేరతానని మాట ఇచ్చాడు. నేను మళ్లీ స్కాబ్ పని చేస్తే, నరకానికి పోతానన్నాడు. జనరల్ మేనేజర్ ప్రభుత్వ అధికారిని పిలిపించాడు. 'నువ్వు, నీ మహిళలను తీసుకొని వెళ్లిపోవాలి' అని ఆ అధికారి నన్ను అదేశించాడు. "మేము ఎవరికీ ఏ అపకారం చెయ్యలేదు. అమా యకులైన కార్మికుల హత్యలు ఇక మీదట జరగనివ్వను. మీరు నిజంగా శాంతిని కోరుకుంటే సమ్మె పరిష్కారం అయ్యేంత వరకు గనులు మూతబడ్డాయని నోటీసులు ఇవ్వండి" అని అన్నాను.

ఈ రోజు చాలా ఉద్రిక్తంగా ఉంది. సంవత్సరాల తరబడి ఈ కార్మికులకు పిరికి మందు నూరిపోయడం వలన, వాళ్లకు సమ్మె చేయాలని వున్నప్పటికీ ధైర్యం చేయలేక పోయారు. ఎప్పుడైతే వాళ్లకు బయట సాయం అందిందో దాన్ని ఆసరా చేసుకొని తోటి సోదరులతో కలిసి నడిచారు. సమ్మెలోకి దిగారు.

గనుల యజమానులు నన్ను, నా మహిళా సైన్యాన్ని లాటిమర్ నుండి బయటకు తీసుకుపోవాలని జాన్ మిట్చెల్‌ని ప్రాధేయపడ్డారు. నేను ఇక్కడ ఉన్నానని మిట్చెల్‌కు అప్పుడే తెలిసింది.

అయినప్పటికీ మేనేజర్‌కు ఎటువంటి ఆశ కనిపించలేదు. తన

**ఈ రోజు చాలా ఉద్రిక్తంగా ఉంది. సంవత్సరాల తరబడి ఈ కార్మికులకు పిరికి మందు నూరిపోయడం వలన, వాళ్ళకు సమ్మె చేయాలని వున్నప్పటికీ ధైర్యం చేయలేకపోయారు. ఎప్పుడైతే బయట వాళ్ళకు సాయం అందిందో, దాన్ని ఆసరా చేసుకొని తోటి సోదరులతో కలిసి నడిచారు. సమ్మెలోకి దిగారు.**

ఎత్తులు పారవని తెలిసింది. గత్యంతరం లేక బయటకు వచ్చి సమ్మె పరిష్కారమయ్యే వరకు గనులు మూతబడ్డాయని నోటీస్ పెట్టాడు. ఇలా కార్మికులు యుద్ధంలో గెలిచారు.

నేను, నా మహిళా సైన్యంతో కలిసి లాటిమర్ నుండి హజెల్‌టన్‌కు వెళ్లాను. అక్కడ ప్రెసిడెంట్ మిట్చెల్ ఇతర నాయకులున్నారు. 'మీరు లాటిమర్‌కు వెళ్లడానికి భయపడలేదా' అని మిట్చెల్ అడిగాడు. లేదని చెప్పాను. 'నా వర్గానికి లాభం చేకూర్చే ఏపని చేయడానికైనా నేను భయపడను'అన్నాను.

రాక్షసి బొగ్గు జిల్లా మొత్తంగానే లాటిమర్ విజయం వల్ల కొత్త జీవితాన్ని పొందింది. యూనియన్‌కు ధైర్యాన్ని ఇచ్చింది. సత్తు కళాయిలతో, పిల్లి కూతలతో ముందుకు నడిచి ఆ రాతి గోడలను కూల్చడానికి కారణమైన ఆ ధీరవనితలను నేనెన్నటికీ మర్చిపోను.

సమ్మె పరిష్కారమైన వెంటనే సభ జరిగింది. జాన్ మిట్చెల్ కోసం పదివేల డాలర్ల ఖరీదు చేసే ఇల్లు కొనిపెట్టడానికి ప్రతి గని కార్మికుడూ చందా ఇవ్వాలని నిర్వాహకులు ఆ సభలో ప్రతిపాదించారు. నేను లేచి నిలబడి,

'జాన్ మిట్చెల్, తనకు, తన భార్యకు కావలసిన ఇల్లు అతని జీతం డబ్బు నుండి కొనుక్కోలేక పోతే పదివేల డాలర్ల జీతం వచ్చే మరో ఉద్యోగాన్ని చూసుకోమనండి. మీలో చాలా మందికి ఇంటి పైకప్పుకు అవసరమైన కొయ్యపెంకులు కూడా లేవు. ఆత్మాభిమానం ఉన్నవాడెవడైనా తన భార్యకు ఇల్లు కొన్న తరువాతనే మరొకరి భార్య కోసం ఇల్లు కొంటాడు' అన్నాను.

'ఈ కష్ట కాలంలో మీరు, మీ ఆడవాళ్లు చేసిన త్యాగం, సహనం వల్లనే విజయం సాధించాము. మీరు తుదికంటా నిలబడాలని, విజయం సాధించాలన్న కాంక్షతో ఇతర ప్రాంతాల్లో పనిచేసే మీ సోదరులు అందించిన సహాయం వలన ఈ గెలుపు సాధ్యమయ్యింది' అని అన్నాను.

అప్పటి నుండి మిట్చెల్ నాతో ముభావంగా ఉంటున్నాడు. అతను నా చొరవను, నాధోరణిని వ్యక్తిగతంగా తీసుకున్నాడు. అతను అధికారం రుచి మరిగాడు. అదే అతన్ని పూర్తిగా నాశనం చేసింది. నాయకుడు నిష్పాక్షికంగా ఉండాలని నేను నమ్మాను. అయితే అతను, తనకు ఉపకారం చేసినవాళ్లను మాత్రమే నమ్ముతాడు.

**సశేషం...** 

# పోరాటం కాలుష్య ఆక్వాఫుడ్ పార్క్ మాకొద్దు

- పి. పూర్ణ, డి. కళ్యాణి

తుందుర్రు, కంసాలిబేతపూడి, జొన్నలగరువు ఇవి పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం, నర్సాపురం రూరల్ మండలంలోని చిన్న గ్రామాలు. రెండు మాసాల క్రితం వరకు ఈ గ్రామాలు వీటి పేర్లు ఈ ప్రాంతం వారికి మాత్రమే తెలుసు. కానీ ప్రస్తుతం రాష్ట్ర ప్రజానీకంలో పెద్ద చర్చానియాంశంగా మారింది. దీనికి కారణం, ఆ గ్రామాల మధ్య తీవ్రమైన కాలుష్యాన్ని వెదజల్లే మెగా ఆక్వా ఫుడ్‌పార్క్ నిర్మించాలనుకోవడం. మొదట్లో రొయ్యల చెరువుల పేరుతో 60ఎకరాలు కొనుగోలు చేశారు. ఏడాదికి రెండు పంటలు పండే పంట పొలాలను ఆర్థిక ఇబ్బందుల వలన అమ్ముకున్నారు. ఇప్పుడు ప్రాణాలు తీసే ఫ్యాక్టరీ పెడుతున్నారు అని తెలిసి ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు ఈ ప్రాంత ప్రజలు.

ఈ ఫుడ్ పార్క్‌లో రొయ్యలు, పీతలు, చేపలు, మూడు సంవత్సరాలు నిల్వ ఉంచుతారు. దీనికి పెద్ద మొత్తంలో నీరు అవసరం ఉంటుంది. వీటిని నిల్వ ఉంచడానికి శుద్ధి చేస్తారు. ఈ శుద్ధికి మంచినీరు అవసరం వుంటుంది. ఆ నీటిని గొంతేరు కాలువ నుంచి పైపులను పిల్ల కాలువకు కనెక్ట్ చేసి పైపుల ద్వారా ఫ్యాక్టరీకి తరలించుకుంటారు. ఈ చేపలను, రొయ్యలను నిల్వ ఉంచడానికి అనేక రసాయనాలతో శుద్ధి చేస్తారు. ఈ శుద్ధి చేసిన నీటిని పైపుల ద్వారా గొంతేరు కాలువలోకి వదులుతారు. అంటే వ్యర్థాలన్నీ గొంతేరు కాలువలో కలుస్తాయి. ఫ్యాక్టరీ నిర్మాణం జరిగితే త్రాగునీరు అందిస్తున్న గొంతేరు కాలువ కూడా యనమదులు కాలువ వలెనే మారుతుంది. ఫలితంగా పంట భూములన్నీ కాలుష్యానికి గురి అవుతాయి. పంటలు పండవు. గొంతేరు కాలువపై ఆధారపడి వున్న 40వేల మంది మత్స్యకారులు జీవనాధారం కోల్పోతారు. ఇప్పటి వరకు సాగునీరు, త్రాగునీరు అందజేసే గొంతేరు కాలువ విషపూరితంగా మారుతుంది. ఇద్దరు వ్యక్తుల కోసం రాష్ట్ర ప్రభుత్వం ఇంత మంది బతుకులను కాలరాస్తోంది. ఈ కాలుష్య భూతం మాకొద్దని ఆ ప్రాంత వాసులు రెండున్నరేళ్ళ క్రితం "గోదావరి మెగా ఆక్వా ఫుడ్ పార్క్ వ్యతిరేక పోరాట కమిటీ" ఏర్పాటు చేసుకున్నారు. ఈ కమిటీకి కన్వీనర్ ఆ గ్రామ యువకుడు ఆరేటి వాసు. కంసాలి బేతపూడి యువకుడు ముచ్చెర్ల త్రిమూర్తులు సారధ్యంలో సంవత్సర కాలం అధికారుల చుట్టూ తిరిగి ప్రజా ప్రతినిధులందరికీ వినతి పత్రాలిచ్చి తమ బాధలు చెప్పుకున్నారు. అయినా ఎవరూ కనికరించలేదు.

రెండున్నర సంవత్సరాలు అలుపెరుగని పోరాటం చేశారు. చుట్టుపక్కల 25గ్రామాల ప్రజల మద్దతు కూడబెట్టగలిగారు. కానీ పెట్టుబడిదారులు పక్షానే నిలిచే ఈ ప్రభుత్వం ఎమర్జెన్సీని తలపించే విధంగా పోలీసులను వందలాదిగా గ్రామాలలో దించి ఇంటికి ఇద్దరు పోలీసులను కాపలాగా ఉంచి జనాన్ని బయటకు రానీయకుండా నిర్భంధించి రెండు నెలల పాటు 144 సెక్షన్ విధించారు. సి.ఎం చంద్రబాబు నాయుడు శంకు స్థాపనకు వస్తున్నారు అనే ప్రకటన వచ్చింది.

ఒక ప్రక్క జోరువాన, పోలీసు బందోబస్తు, ఎవర్ని రోడ్డుమీద నడవనివ్వటంలేదు.



ఐద్వా మహిళా దళం జిల్లా కార్యదర్శి డి. కళ్యాణి, సహాయ కార్యదర్శి పి. పూర్ణ గ్రామాలు తిరిగి సి.ఎం. కార్యక్రమాన్ని ఎలా అడ్డుకోవాలనే దానిపై మహిళలను కూడగట్టి, గ్రూపు మీటింగులు నిర్వహించి మహిళలను సన్నద్ధపరిచారు. పిల్ల, పెద్ద అందరూ కలిసి శంకుస్థాపన ఆపాలి. అప్పటి వరకు ఆ ప్రాంత ప్రజలకు పోరాటవారసత్వం లేదు. మహిళలు ఎప్పుడూ ఆ పరిసర గ్రామాలను దాటి బయటకు వెళ్లిందీ లేదు. అటువంటి మహిళలు ఐద్వా సంఘం ఇచ్చిన అండతో ఐద్వా నాయకత్వ భరోసాతో ఉద్యమంలోకి వేటాడే పులుల మాదిరి దూకారు. స్త్రీలు, పురుషులు, వృద్ధులు తేడా లేకుండా పోలీసుల వలయాన్ని బద్దలు కొట్టి సైట్‌లోకి వెళ్ళిపోయారు. 'మా గ్రామాల కోసం మా ఆరోగ్యాల కోసం మా బిడ్డల భవిష్యత్తు కోసం ఎంతటి పోరాటానికైనా సిద్ధం' అని మహిళలు ప్రాణాలకు తెగించి పోరాటం చేశారు. 2014 డిసెంబర్‌లో చిన్న నీటి ప్రవాహంగా మొదలైన ఉద్యమం ప్రజా సంఘాల మద్దతుతో మహోద్యమంగా మారింది.

పోరాటం ఉధృతమైంది. ఫ్యాక్టరీని ప్రజలకు ఇబ్బందిలేని చోటుకు తరలించాలని సిపిఎం చేపట్టిన పాదయాత్రలోనూ చంటిబిడ్డలతో సహా తల్లులు తమ వంతుగా

ఉద్యమంలో పాల్గొన్నారు.

ఏనాడూ పోలీస్ స్టేషన్ గుమ్మం తొక్కని పోరాట నాయకురాలు ఆరేటి సత్యవతిని 44 రోజులపాటు అరెస్టు చేసి జైలులో వుంచారు. ఆమె కుమారుడు ఆరేటి వాసుని నర్సాపురం జైలులో, సత్యవతిని తణుకు సబ్‌జైలులో వుంచారు. గ్రామాల్లో ప్రజలను పలకరించ టానికి ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి.రమాదేవి గారు వస్తే అరెస్టు చేసి నర్సాపురం రూరల్ స్టేషన్‌కి కొట్టి తీసుకువచ్చారు. మాజీ రాజ్యసభ సభ్యురాలు బృందాకరత్ గారు వచ్చి గ్రామాల్లో పర్యటించి 'కన్నీళ్ళు వద్దు పోరాటం' చేయాలి అని మహిళలకు ధైర్యం చెప్పి వెళ్ళారు. ఈ సమస్యని జాతీయ స్థాయికి తీసుకువెళ్ళారు.

దీంతో సిఎం సమీక్ష జరిపి సుమారు 20కిమీ కాలుష్యనీరు సముద్రంలోకి పోయే విధంగా పైపులైన్ వేయిస్తామంటూ ప్రకటిం చారు. అయినా ప్రజలు అంగీకరించలేదు. అధికారులు ప్రజలకు నచ్చజెప్పేందుకు పెట్టిన సభలో జనం లేక వెలవెలబోతుంటే పాదయాత్ర ముగింపు సభకు 4000 మంది ప్రజలు హాజరు కావడంతో ప్రజాభిప్రాయం ఎంత బలంగా ఉందో, అర్థం చేసుకోవచ్చు.

అట్టహాసంగా చూస్తున్న తెలుగుదేశం జన చైతన్య యాత్ర కూడా ఆ గ్రామాలు వెళ్ళేందుకు ఎంఎల్ఎలు ధైర్యం చెయ్యలేక రౌడీలను వెంటబెట్టుకొని కంసాలి బేతపూడి వెళ్ళారు. రామలక్ష్మి, సత్యవాణి తదితర మహిళలపై దాడి చేసి "మమ" అనిపించు కున్నారు. అది ఆ గ్రామాల్లో మహిళల పోరాట చైతన్యానికి నిదర్శమని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

ప్రజా ఉద్యమం ధాటికి ఎవరైనా తలొగ్గక తప్పదు. అలా కాదని మొండిగా ప్రజలకు వ్యతిరేకంగా వెళ్తే వారు చరిత్రలో హీనులుగా మిగిలి పోక తప్పదు. మరి మన రాష్ట్ర ముఖ్య మంత్రి చంద్రబాబు ప్రజల పోరాటానికి విలువనిచ్చి ఫ్యాక్టరీని వేరే ప్రాంతానికి తరలిస్తారో... లేక పెట్టుబడి దారులకు ఊడిగం చేసే వానిగా మిగిలిపో తారో చూడాలి. పోరాటం విజయ వంతం కావాలని ఆశిస్తూ... పోరాడుతున్న ప్రజలకు జేజేలు... అగ్రభాగాన ఆదర్శంగా, ఉత్తేజంగా నిలుస్తున్న మహిళలకు జేజేలు. ●

# వాట్సాప్‌లో అత్యాచార వీడియోలపై సుప్రీం సీరియస్ సర్కార్ తీరుపై మండిపాటు

వాట్సాప్‌లో రేప్ వీడియోలను పోస్ట్ చేసిన కేసుకు సంబంధించి కేంద్రం స్పందించకపోవడం పట్ల సుప్రీం కోర్టు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసింది. 'పదకొండు నెలలుగా దీనిపై సమాధానం ఇవ్వడానికి ప్రభుత్వానికి తీరిక లేదా'? అని ప్రశ్నించింది. సీరియస్ అంశాన్నీ పట్టించు కోకుండా వదిలివేశారు. నెలల తరబడి ఏమీ చేయకుండా కూర్చున్నారు.

ఇది ప్రజా ప్రయోజనాలకు ముడిపడిన అంశమని మీరు అనుకోవడం లేదా అంటూ జస్టిస్ ఎంబీ లోకూర్, యూయూ లలిత్‌తో కూడిన సుప్రీం బెంచ్ ప్రభుత్వంపై మండిపడింది. అయితే సంబంధిత హోమ్ మంత్రిత్వ శాఖ అధికారులు 'పార్లమెంట్ సమావేశాలతో బిజీగా ఉన్నార'ని తెలపడంతో, 'వారు పార్లమెంట్‌లో బిజీగా ఉంటే తాము ఇక్కడ ఖాళీగా కూర్చున్నామని భావిస్తున్నారా'? అంటూ కోర్టు ఆగ్రహం వ్యక్తం చేసింది. ప్రభుత్వానికి సమాధానం ఇచ్చేందుకు కొంత సమయం ఇవ్వాలని కేంద్రం తరపు న్యాయవాది బాల సుబ్రమణియమ్ కోరగా, ఓ వారంలో అఫిడవిట్ దాఖలు చేయాలని కోర్టు ఆదేశించింది.

సైబర్ నేరాల కేసులకు సంబంధించి ప్రభుత్వం ఎలాంటి నిబంధన లను పొందుపరచలేదని దుయ్యబట్టింది. హైదరాబాద్‌కు చెందిన ఎన్‌జీఓ ప్రజ్వల రాసిన లేఖకు సుమోటోగా స్పందించిన కోర్టు ఈ అంశాన్ని విచారిస్తోంది. అప్పటి ప్రధాన న్యాయమూర్తి హెచ్ఎల్ దత్తుకు ప్రజ్వల లేఖతో పాటు వాట్సాప్‌లో పోస్టు చేసిన రెండు రేప్ వీడియోలతో కూడిన పెన్‌డ్రైవ్‌ను పంపింది. అంతకుముందు సామాజిక మీడియా వెబ్‌సైట్లలో వైరల్ అయ్యే అత్యాచార దృశ్యాలను బ్లాక్ చేయడంపై వివరాలను సమర్పించాలని ఐటీ మంత్రిత్వ శాఖను కోరింది. ఇలాంటి రేప్ వీడియోలపై ఫిర్యాదు చేసేందుకు, వాటిని బ్లాక్ చేసేందుకు నిర్దిష్ట వేదిక, విభాగం ఉండాలని సామాజిక కార్యకర్త సునీత కృష్ణన్ వినతిపై ఐటీ శాఖ బదులివ్వాలని సర్వోన్నత న్యాయస్థానం కోరింది. ఇదే అంశంపై సుప్రీం కోర్టు కేంద్ర ప్రభుత్వంతో పాటు ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాల్, ఒడిషా, ఢిల్లీ, తెలంగాణ ప్రభుత్వాలను సమాధానం ఇవ్వాలని కోరింది.

# ఐద్వా 11వ అఖిల భారత మహాసభలు

## డిసెంబర్ 10-14
## భోపాల్, మధ్యప్రదేశ్




**అ**ఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం 11వ మహాసభలు డిసెంబరు 10-14 వరకు మధ్యప్రదేశ్‌లోని భోపాల్‌లో జరగనున్నాయి. ఈ సభల సందర్భంగా దేశంలోని నలుమూలల నుండి 4 జాతాలు ఐద్వా జెండాతో బయలుదేరి 9వ తేదీకి భోపాల్ చేరనున్నాయి. మన రాష్ట్రంలో అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం జాతా అనంతపూర్, కర్నూలు, గుంటూరు, కృష్ణాలలో జరిగాయి.

ఆర్.ఎస్.ఎస్ భావజాలానికి ప్రతీకగా బిజెపి అధికారంలోకి వచ్చిన నేపథ్యంలో మహిళా హక్కులపై తీవ్ర దాడి పెరిగింది. సాధించుకున్న హక్కులు సైతం వమ్ము చేయబడుతున్నాయి. హర్యానా పంచాయతీ రాజ్ చట్టంలో సవరణలు తీసుకురావటం ద్వారా మెజారిటీ పంచాయతీలలో పోటీ చేసే వారు కూడా లేక ఏకగ్రీవమయ్యాయి. దళితులు, మహిళలు అనేక మంది పోటీకి అనర్హులు కాబడ్డారు. ప్రజాస్వామ్యాన్ని పరిమితం చెయ్యడానికి సాగిస్తున్న ప్రయత్నాలకు ఇదో ఉదాహరణ. ఛత్తీస్‌ఘర్‌లోని గిరిజనుల స్థితిగతులపై అధ్యయనం చేసి వారి హక్కుల ఉల్లంఘన వెలికి తీస్తున్న అర్చనా ప్రసాద్, నందినీ సుందర్, సంజయ్ పరాటే తదితర ఢిల్లీ యూనివర్శిటీ ఆచార్యులపై హత్యా నేరం క్రింద కేసులు పెట్టటం ప్రజాస్వామిక హక్కులు కాల రాసేందుకు బిజెపి చేస్తున్న తెంపరి యత్నాలకు నిదర్శనం.

బిడ్డలపై తల్లికి హక్కు లేకుండా చేయడం, వ్యభిచారాన్ని చట్టబద్ధం చేసే యత్నాలు, లింగ నిర్ధారణ పరీక్షల చట్టాన్ని నీరు గార్చే యత్నాలు, కుటుంబ వృత్తుల పేరిట బాల కార్మికుల వ్యవస్థను బలోపేతం చేసే చట్టాలు ఈ కాలంలో చేయబడ్డాయి. మహిళా సమస్యలపై రానున్న పార్లమెంటు సమావేశాలలో చట్టం చేయనున్నది. దీనిపై చర్చల కు తమ ఫండింగు మీద ఆధార పడాల్సిన ఎన్‌జిఓలను మాత్రమే పిలిచారు. మహిళల్లో నిరంతరం పనిచేసే ఐద్వా లాంటి ప్రజా సంఘాలను పక్కన బెట్టి హక్కులను కుదించే యత్నాలు చేస్తున్నారు. నోట్ల రద్దు, ప్రణాళికా సంఘం రద్దు తదితర చర్యల వలన బాధలకు గురయ్యే వారిలో మహిళలే ముందు బాధితులుగా ఉన్నారు. పెద్దనోటు మారక బిడ్డలకు తిండిపెట్టలేక, వైద్యం చేయించలేక బిడ్డలను కోల్పోయిన, ఆత్మహత్య చేసుకున్న తల్లులను మనం చూశాం. ఐసిడిఎస్, మధ్యాహ్న భోజనం, ఆడపిల్లల రక్షణ పథకం, నిర్భయ నిధి, ఉపాధి హామీ లాంటి పథకాలకు నిధుల కొరత భారీగా పెరగటం గత రెండు బడ్జెట్లలో సాగింది.రాజ్యాంగాన్ని, ప్రజాస్వామిక చట్టాన్ని రక్షించుకుంటేనే మహిళా హక్కులకు రక్షణ వుంటుంది.

మహిళలపై, దళిత ఆదివాసీలపై హింస హద్దులు లేకుండా పెరుగుతుంది. ఐపిసి సెక్షన్ 498(ఎ) నీరు గార్చడంతో కుటుంబహింసకు గురవుతున్న మహిళలకు ఉపశమనం లేకుండా పోయింది. మహిళలపై జరుగుతున్న నేరాలలో మన రాష్ట్రం రెండవ స్థానంలో ఉంది. మహిళలపై అత్యాచారాలు, అధినాయకుల కుమార రత్నాల ఆగడాలు, పోలీసులు పోలీస్ స్టేషన్లలోనూ, బైటా చేసే అకృత్యాలు, పెరిగిన మొబైల్ ఫోన్లలో ఫేస్‌బుక్ స్నేహాలు, బ్లూఫిల్మ్‌ల చిత్రీకరణ. అంతులేని హింసాకృత్యాలు!దీనికి ఆడవారినే నిందించే సామాజిక స్థితి. సంస్కృతి పేరిట మూఢత్వాన్ని, అసమానతను పెంచిపోషిస్తున్న పెద్దలు దీనికి మరింత ఆజ్యం పోస్తున్నారు.

33% కాదు 50% రిజర్వేషన్లు ఇస్తానన్న మోడీ గారు మౌనవ్రతంలో మన్మోహనసింగును మించిపోయారు. సంసారాన్ని దిద్దటంలో, కుటుంబపోషణ కోసం రెక్కలుముక్కలు చేసుకుంటున్నా ఆడదన్న సాకుతో హీనమైన వేతనాలు. మాల్స్‌లో, స్కూల్స్‌లో, రెడీమేడ్ వస్త్రాల పరిశ్రమలలో, నూలుమిల్లులు, మిర్చి, పసుపు, మసాలా అన్నింటా ఆడవాళ్ళదే శ్రమ! కాని దుర్భర దారిద్ర్యం, వేదన, అంతులేని వలసలు, గల్ఫ్ దేశాల్లో ఆరళ్ళు. ఆర్చేవారేరి? కారు చౌకగా ఆడవాళ్ళ శ్రమను కొల్లగొట్టేందుకు రాత్రివూట కూడా పనిచేయడానికి చట్టంలో సడలింపులు చేశారు.

ఇదీ మనం మహిళకి ఇస్తున్న గౌరవం. ఇలాంటి దిగజారుతున్న పరిస్థితులలో ఐద్వా, ఇతర సంఘాలు, వ్యక్తులు, గ్రూపులు తమ గళం విప్పుతున్నాయి. "పంజరాలను బద్దలు కొడుదాం." "హ్యాపీ టు బ్లీడ్" లాంటి ఉద్యమాలతో విద్యార్థినులు,ఉద్యోగినులు, స్త్రీల శరీరాల చుట్టూ అల్లబడిన మాయపొరలను చీల్చుతున్నారు. ఆడపిల్లలకు దేవాలయాల్లో, దర్గాలలోప్రవేశం కోసం ఉద్యమిస్తున్నారు. తలాక్, బహుభార్యత్వం లాంటి దుస్సాంప్రదాయాలు కూడదంటున్నారు. నహనం, నమభావమే మతాలసారమని ధీటుగా ఛాందసవాదులను సవాల్ చేస్తున్నారు.

కనీస హక్కులను గ్యారంటీ చేసిన చట్టాలను సంక్షేమ చర్యలను వమ్ముచేయడాన్ని ప్రశ్నిస్తున్నారు. అక్రమంగా భూములు కొల్లగొట్టటం, పని లేని పరిస్థితిని కల్పించడం. రేషన్లు, పెన్షన్లు బయోమెట్రిక్ పేరిట తగ్గించడం, నగదుబదిలీ, నోట్లరద్దు పేరిట బ్యాంకుల చుట్టూ తిప్పడం, డ్వాక్రా మహిళలే ప్రభుత్వానికి సబ్సిడీలిచ్చే స్థితిని ఎదిరిస్తున్నారు. మహిళలు ఎదుర్కొంటున్న, ప్రశ్నిస్తున్న అన్ని సందర్భాలలో ఐద్వా ముందు పీఠిన నిలబడుతున్నది. అచ్చేదిన్‌లు వస్తాయని భ్రమించిన ప్రజలు, మహిళలు మాటల గారడీ మోడీవేనని. చేతలన్నీ ఉన్న వారికేనని తేటతెల్లమవుతుంటే నిప్పులు కక్కుతున్నారు.

కులం పేరిట, మతం పేరిట రకరకాల పన్నాగాలను ఎదిరించి ప్రశ్నించే హక్కును, ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవడమే నేడు ముందుకు వచ్చిన కర్తవ్యం.నవంబరు 25 హింసా వ్యతిరేకదినం నాడు ప్రారంభమై డిసెంబరు 6 అంబేద్కర్ వర్ధంతితో ముగియనున్న ఈ జాతాలను జయప్రదం చేద్దాం. మహిళా హక్కుల సాధనలో ముందడుగు వేద్దాం. ○○

వ్యాసం

# ఛాందసవాదంపై ఉక్కు పిడికిలి



చైతన్యం రగిలించిన 'మహాత్మ జ్యోతిరావు పూలే' నాటకం

స్వాతంత్రానికి పూర్వం భారత దేశంలో ఉన్న మూఢాచారాలను ఎదిరించి ఛాందసవాదంపై ఉక్కు పిడికిలి బిగించిన మహాత్మ జ్యోతిరావు పూలే జీవిత విశేషాలతో ప్రదర్శించిన 'మహాత్మ జ్యోతిరావు పూలే' నాటకం ప్రజల్లో చైతన్యాన్ని రగిలించిది. జ్యోతిరావు పూలే వర్ధంతిని పురస్కరించుకుని రాష్ట్ర వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ సౌజన్యంతో దుర్గాపురంలోని ఘంటసాల వెంకటేశ్వరరావు ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలలో నాటక ప్రదర్శన జరిగింది. మహారాష్ట్రలో 19వ శతాబ్దపు పీష్వాల పాలన అణగారిన వర్గాలకు అంధయుగం, శూద్రులు, స్త్రీలు, దళితులు బడికి, గుడికి దూరంగా ఆకలితో అవమానంతో నరకం అనుభవిస్తారు. శూద్రమాలీ ఇంట జన్మించిన పూలే బ్రాహ్మణ మిత్రుడి ఊరేగింపులో పాల్గొని దారుణంగా అవమానించబడతాడు. బ్రాహ్మణ భట్టుల దౌష్ట్యాన్ని, దౌర్జన్యాన్ని చూసి చలించిపోతాడు. చదువు ఒక్కటే సమస్యలకు పరిష్కారమని గుర్తించి స్త్రీల కోసం అస్పృశ్యుల కోసం పాఠశాల స్థాపిస్తాడు. భార్యకు చదువు నేర్పి ఉపాధ్యాయినిగా చేస్తాడు.

మత మౌఢ్యాన్ని, కుల కుటిలత్వాన్ని ఎదిరించి, అస్పృశ్యులకు అక్షరాలు నేర్పిస్తాడు, గర్భవతి అయిన బ్రాహ్మణ వితంతువును ఆదరించి ఆమెకు పుట్టిన బిడ్డను తన బిడ్డగా పెంచుకుంటాడు. కులాంతర వివాహాలు జరిపిస్తాడు. భారతీయుల్ని అవమానించిన తెల్లదొరలను తరిమితరిమి కొట్టి తన దేశభక్తిని చాటుకుంటాడు. మనవులంతా సమానమని ప్రకటిస్తూ 'సత్యశోధక' సమాజాన్ని స్థాపిస్తాడు. సమాజంలో ఛాందస వాదాన్ని, మూఢాచారాలను పారదోలేందుకు ప్రజలను చైతన్యవంతుల్ని చేస్తాడు. ఆంగ్ల ప్రభుత్వం కూడా పూలేని సత్కరిస్తుంది. బరోడా రాజు శాయాజీ మహారాజ్ 5 లక్షల మంది ప్రజల సమక్షంలో 'మహాత్మ' అనే బిరుదు ప్రదానం చేసి ఘనంగా సత్కరిస్తాడు. పూలే పాత్రధారి బి. నాగేశ్వరరావు నటన ప్రేక్షకుల్ని తన్మయుల్ని చేసింది. మహాత్మపూలే మరణించిన కొద్ది రోజుల్లో జన్మించిన బాబా సాహెబ్ అంబేద్కర్ పూలేని తన గురువుగా ప్రకటిస్తాడు. ఈ నాటకం రచన సంగీత నాటక అకాడమి అవార్డు గ్రహీత, భాషా సాంస్కృతిక శాఖ సంచాకులు డాక్టర్ డి. విజయభాస్కర్, దర్శకత్వం పాటిబండ్ల ఆనందరావు, సంగీతం ఇండ్ల ఏసుపాదం. స్థానిక నిర్వహణ కులవివక్ష పోరాటం సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆంద్ర మాల్యాద్రి. ఈ నాటకాన్ని ఎంఎల్ఎ బోండా ఉమా ప్రారంభించారు.

**నేటి సమాజానికి ఎంతో అవసరమైన ప్రదర్శన**

ప్రస్తుత సమాజానికి మహాత్మ జ్యోతిరావు పూలే నాటకాన్ని గ్రామ గ్రామాన ప్రదర్శించాల్సిన అవసరం ఉందని ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డి. రమాదేవి అన్నారు. జోతిరావు పూలే నాటక ప్రదర్శన సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో ఆమె పాల్గొన్నారు. నేటి సమాజంలో అనేక కుల, మత అసమాన తలు పెరిగిపోతు న్నాయని చెప్పారు. నాటక రచయిత డాక్టర్ డి. విజయభాస్కర్ మాట్లాడుతూ చారిత్రాత్మకమైన నాటకాన్ని ఎంతో చక్కగా ప్రదర్శించారని అభినందించారు. ○

(పుస్తక సమీక్ష)

# 'సమతావని' నవల

-వాడ్రేవు వీరలక్ష్మీదేవి

'సమతావని' అనే పేరుతో వచ్చిన ఈ నవల 1987లో చతుర నవలల పోటీలో ప్రోత్సాహక బహుమతి పొందినది. ఈ నవల అప్పుడు "ప్రమదావని" అనే పేరుతో వచ్చింది. అదే ఇప్పుడు 2016లో దాదాపు 30 ఏళ్ళ తరువాత పుస్తక రూపంలో మన ముందుకు వచ్చింది.

ప్రసిద్ధ స్త్రీవాద రచయిత్రి ఓల్గా గారి సోదరుడు ప్రసాద్ గారు తన పేరు ఫెమినిస్టు ప్రసాదుగా మార్చుకొని ఈ నవలా రచయితగా ముందుకు వచ్చారు. ఆయన పేరు పి.వి.ఎస్ ప్రసాద్. కానీ ఫెమినిస్టు అని తన పేరుకు ముందు చేర్చుకోవడానికి కారణం ఆయన ఇలా చెప్పారు.

"ఆడవాళ్ళ హక్కుల గురించి, తమ జీవితాల గురించి ఆలోచించి ఉద్యమాలు చేయడంతో ఫెమినిజం పుట్టుకొచ్చింది. కానీ కాల క్రమంలో ఫెమినిజం తన పరిధిని చాలా విస్తృతపరచుకుంది. ఇప్పుడు ఫెమినిజం స్త్రీల సమస్యలకు మాత్రమే పరిమితమైన అస్తిత్వ వాదం కాదు. స్త్రీ పురుషులందరికీ ప్రపంచం మొత్తానికి సంబంధించినది. కనుక నేను "ఫెమినిస్టు"నని గర్వంగా మనవి చేసుకుంటున్నాను".

ఆయన ఉద్దేశంలో ఫెమినిజం గురించి ఇలా చెప్పారు. "ఆర్థిక, రాజకీయ, సామాజిక విషయాలన్నింటిలోనూ స్త్రీ పురుషులకు సమానహక్కులు, అవకాశాలు ఉండే వ్యవస్థను తీసుకురావడం ఫెమినిజం లక్ష్యంగా భావిస్తున్నానని , అటువంటి ప్రపంచానికే తన నవలలో "సమతావని" అనే పేరు పెట్టానని" చెప్పారు.

అయితే ఇప్పుడు ఫెమినిజం ఉన్న పరిస్థితి గురించి ఆయన విచారం వెలిబుచ్చారు. "ఇప్పటి పరిస్థితుల్లో ఫెమినిజం చలనం లేకుండా నిలిచి పోయింది. గొప్ప విప్లవాన్ని తెస్తుందనుకున్న ఫెమినిజం అల్పమైన విషయాల గురించి, సామాన్యులకు అర్థం కాని పండిత చర్చలకు పరిమితమైపోతోంది. రకరకాల పేర్లతో విడిపోతోంది". ఇన్ని విధాలుగా విడిపోయి ఇన్ని రకాలుగా చర్చల్లో మిగిలిపోయిన ఫెమినిజాన్ని, దాని తాలూకా అస్తవ్యస్తత చిక్కుముళ్ళ గురించి ప్రసాద్‌గారు గొప్ప పోలికతో ఇలా చెప్పారు.

"దారాలు పోగులుగా తెచ్చి గుట్టలుగా పడేస్తున్నారు. ఆ పని ఇప్పుడు నాలాంటి మగవాళ్ళు కూడా మొదలుపెట్టారు. ఈ దారాలతో ఏ వస్త్రాన్ని తయారు చేయాలి? ఎవరి కోసం తయారు చేయాలి? ఏ ఆకారంలో, ఏ రంగులో ఉండాలి? అనే విషయాన్ని ఎవరూ పట్టించుకోవడం లేదు. వస్త్రాన్ని తయారు చేసే పని మొదలుపెట్టడం లేదు. ఈ దారాలన్నీ చిక్కుముళ్ళు పడి చివరకు పనికి రాకుండా పోతాయి. అప్పుడుగానీ తిక్క వదలదు.




పై మాటలు ఆలోచించవలసిన మాటలు. ఫెమినిస్టు ఆలోచనలు విశ్వ విద్యాలయాల్లో పరిశోధనల రూపంలో దారాలుగా చిక్కుముళ్ళుపడి ఉపయోగానికి పనికి రాకుండా పోతాయన్న హెచ్చరిక ఇందులో ఉంది. ఆచరణలోకి తేవాల్సిన అవసరాన్ని గురించిన విజ్ఞప్తి కూడా వీటి వెనుక వుంది.

ఇందుకోసం ప్రసాద్‌గారు ఎంతో ముందుగానే ఆయన వంతు ప్రయత్నం ఈ నవల ద్వారా చేశారు. 1987నాటికి స్త్రీ వాద సిద్ధాంతాల భావజాలాలు ఇంకా తెలుగు సాహిత్యంలోకి పూర్తిగా ప్రవేశించనే లేదు. కానీ ఆయన తనకు ఉన్న సామాజిక పరిశీలన ద్వారా స్త్రీల సమస్యల పరిష్కారాల వైపుగా ఈ నవలలో ఒక ప్రయత్నం చేశారు.

**"ఇప్పటి పరిస్థితుల్లో ఫెమినిజం చలనం లేకుండా నిలిచి పోయింది. గొప్ప విప్లవాన్ని తెస్తుందనుకున్న ఫెమినిజం అల్పమైన విషయాల గురించి, సామాన్యులకు అర్థం కాని పండిత చర్చలకు పరిమితమైపోతోంది. రకరకాల పేర్లతో విడిపోతోంది". ఇన్ని విధాలుగా విడిపోయి ఇన్ని రకాలుగా చర్చల్లో మిగిలిపోయిన ఫెమినిజాన్ని, దాని తాలూకా అస్తవ్యస్తత చిక్కుముళ్ళ గురించి ప్రసాద్‌గారు గొప్ప పోలికతో చెప్పారు.**

ఇందులో కథ పైకి కొంత హాస్యంగా, వేళాకోళంగా ఉన్నా పదునైన వ్యంగ్యంతోనే ఉండి స్త్రీల మీద ఉన్న పురుషాధిపత్యపు తీవ్ర రూపాన్ని , దాని ప్రభావాన్ని చూపించడానికి ఈ నవలలో ఈయన ఎన్నుకొన్న పద్ధతి కొత్తగానూ, వింతగానూ ఉంది. పద్ధతి వల్ల ఆయన ఆశించిన ప్రయోజనం నూరుశాతం నెరవేరుతోంది.

ఈ నవలలో మూడు రకాల సమాజాలను చూపించారు రచయిత. మొదటిది పురుషావని, అంటే వందల ఏళ్ళుగా వున్న పురుషాధిపత్య వ్యవస్థ. ఇదే వ్యవస్థ పూర్తిగా తలకిందులయితే ఎలా వుటుందో అది ప్రమదావని. స్త్రీ ఆధిపత్య వ్యవస్థ అన్నమాట. నవలలో ఎక్కువ భాగం ప్రమదావని గురించే రాశారు. పురుషుల స్థానంలో అధికారం చెలాయిస్తూ స్త్రీలు వుంటే ఎలా ఉంటుందో, పురుషులు స్త్రీల లాగా అభద్రతా భావంతో ఇళ్ళల్లో అణిగి మణిగి పడి వుంటే ఎలా వుంటారో ఒక్క అంశం కూడా వదలకుండా రాశారు.

పురుషుల మాటలు, చేష్టలు, ఆలో చనలు అన్నీ కూడా ఇళ్ళల్లో ఉండిపోవడం వలన ఎలా సంకుచితం అయిపోతాయో సోదాహరణంగా, స్పష్టంగా చూపించారు. అలాగే అధికారం చేతులో ఉన్న స్త్రీలలో ఉండే అహంకార భావజాలాలను, దుష్టప్రవృత్తిని కూడా చెప్పకుండా వదలలేదు. అంటే అధికారం ఎక్కడ ఉన్నా అక్కడ స్త్రీ అయినా, పురుషుడు అయినా ఒకేలా ప్రవర్తిస్తారని తేల్చి చెప్పాడు.

పురుషులు బంగారపు మొల తాళ్ళు కట్టుకొని స్త్రీలు మెడలో వేసుకున్న సూత్రాల గొలుసులా దానికి పవిత్రతను ఆపాదిస్తూ ఆ బంగారపు మొలతాడు విషయమై వాళ్ళు మాట్లాడుకునే మాటలు మనకు చదువుతుంటే ఎంతో ఎబ్బెట్టుగా అనిపిస్తాయి. తద్వారా ఆడవాళ్ళ బంగారపు పిచ్చి ఆ సంబంధమైన మాటల వెనుక వున్న ఏహ్యత మనకే తెలిసేలా చేస్తారు. అలవాట్లు ఎంత భయంకరమైనవో ఏ మనిషిని అయినా అవి ఎంతగా లోబరచుకుంటాయో ఈ నవలలోని ప్రమదావని అనే భాగం చదివితే చాలా స్పష్టంగా అద్దంలో చూపించినట్లు తెలుస్తుంది.

"మగ పుట్టుక పుట్టాక దిగులు కాక మరేముంటుంది చెప్పండి". అంటాడు ఇందులో ప్రసాద్ అనే పాత్ర. మీకేమి తక్కువ అయిందని మీరు బాధపడుతున్నారు అంటే ఇలా అంటాడు. "తక్కువకాకేముంది? అర్జెంటుగా డబ్బు కావాలని మొలతాడు తీసుకెళ్ళి తాకట్టు పెట్టుకున్నారు మావారు(భార్య). (ప్రమదావనిలో భర్త భార్యని ఇలాగే అంటాడు). నేనేమో ఈ పసుపు తాడు వేసుకొని తిరగాల్సి వస్తుంది. పక్క వీధిలో మా బంధువులు పేరంటానికి రమ్మన్నారు ఎలా వెళ్ళేది? ఎంత అవమానం? ఇంట్లో నుంచి వీధిలోకి రావాలంటే సిగ్గేస్తోంది" అంటూ కంటతడి పెట్టుకున్నాడు ప్రసాదు.

ఇలా వుంటుంది ప్రమదావని అంతా.

చివరికి పురుషావనిలోనూ, ప్రమదావనిలోనూ ఉన్న అమానవీయతలన్నీ బట్టబయలు చేస్తూ ప్రత్యామ్నాయంగా 'సమతావని'ని రచయిత ఊహిస్తాడు. స్త్రీ పురుషులిద్దరూ ఒకరినొకరు గౌరవించుకుంటూ జాతి, మత, లింగ వివక్షత లేని ఉత్తమ మానసిక ఆరోగ్యంతో, మంచి వ్యక్తిత్వంతో ఉంటే ఆ సమాజం ఎలా ఉంటుందో వర్ణించి చూపిస్తాడు.

నవల మొదటి నుండి చివరిదాకా ఆసక్తిగా చదివేలాగా చెయ్యగల సామర్థ్యం పుష్కలంగా కనిపిస్తోంది. ఓల్గా గారి ముందు మాట, మరొక యువ పాఠకుడి ముందు మాటే కాక రచయిత స్వగతం కూడా నవలకు సిద్దాంత పరమైన అవగాహనను, వ్యాఖ్యానాన్ని అందించాయి. 30 ఏళ్ళ తరువాత కూడా ఈ నవల తన అవసరాన్ని కలిగి ఉంది అంటే అది రచయిత యొక్క సామాజిక స్పృహను, అవగాహనను తెలియజేస్తుంది.



ఉద్యమం

# దివీస్ పోరాటం-నిర్బంధాన్ని ఎదిరించిన మహిళలు

- సిహెచ్. రమణి




**తూ**ర్పుగోదావరి జిల్లా తొండంగి మండలం పంపాదిపేట గ్రామంలో "దివీస్" ఫార్మా కంపెనీ ఏర్పాటుకు ప్రభుత్వం సభలు, రైతులు, ప్రజల అనుమతి లేకుండానే ఏర్పాట్లు ప్రారంభించింది. రెండు గ్రామ పంచాయితీల పరిధిలో రైతుల భూములను అనుమతి లేకుండా దౌర్జన్యంగా ప్రభుత్వం కంపెనీ యాజమాన్యానికి కట్టబెట్టి నిర్మాణానికి సిద్ధమయింది. క్రమంగా ప్రజలందరికీ విషయం తెలియగానే ఉలిక్కిపడి ఆవేదనతో ఉద్యమించారు. రాష్ట్ర ప్రభుత్వం కంపెనీ యాజమాన్యానికి రక్షణ కల్పిస్తూ ప్రజలపై ఉక్కుపాదం మోపింది. గ్రామ ప్రజలపై కేసులు పెట్టి భయపెట్టాలనుకుంది. కానీ ప్రజలు వెనుదిరగలేదు.

**దివీస్‌ని ప్రజలు ఎందుకు వ్యతిరేకిస్తున్నారు**

దివీస్ ఫార్మా కంపెనీతో కాలుష్య కారక వ్యర్థాల వల్ల సుమారు 10 గ్రామాల ప్రజలు జీవనోపాధి కోల్పోతారు. భూములు కోల్పోయే రైతులు వీధినపడతారు. పంటలు లేకపోతే వ్యవసాయ కూలీ మహిళలు పనులు దొరక్క విలవిల్లాడతారు. మొత్తం మండలం సముద్రతీరం కావడం వలన వ్యర్థాలు సముద్రంలో కలిపితే గంగమ్మను నమ్ముకున్న మత్స్యకారులు ఒడ్డున పడ్డ చేపలవలే గిలాగిల్లాడాల్సిందేనని వాపోతున్నారు. రొయ్య పిల్లల పెంపకం పరిశ్రమలో పనిచేసే వేలాదిమంది కార్మికులు, పరిశ్రమదారులు రోడ్డున పడాల్సి వస్తుంది. ప్రధానంగా తాగునీరు, సాగునీరు కలుషితమయ్యే ప్రమాదముంది. వాయు కాలుష్యం కూడా ప్రధానంగా ముందుకు వస్తుంది. ఇప్పటికే ఫార్మా కంపెనీల వల్ల హైదరాబాద్, వైజాగ్ వంటి చోట్ల జరిగిన ఘటనలు ప్రజలకు అవగాహన కల్పిస్తున్నాయి. అందుకే ఈ ప్రాంత ప్రజలు కాలుష్య కారక పరిశ్రమను వ్యతిరేకిస్తున్నారు.

**ప్రభుత్వ వైఖరి– యాజమాన్య పక్షం : ప్రజలపై నిర్బంధం :**

ప్రభుత్వం తన యంత్రాంగంతో ప్రజలను అణచిపెట్టి ఉంచడానికి సెక్షన్ 30,144 వంటివి ప్రయోగిస్తున్నారు. తమ గ్రామాల్లోకి స్వేచ్ఛగా వెళ్లనివ్వడంలేదని ప్రజలు వాపోతున్నారు. 144 సెక్షన్ పెట్టించి ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తోంది. ఒకరికంటే ఎక్కువ గుమికూడవద్దని, సభలు, మీటింగ్‌లు పెట్టవద్దని మైకులలో ప్రచారం చేయించింది. ఎక్కువమంది కలిసివుంటే అరెస్టు చేస్తామని పోలీసులు బెదిరిస్తూ భావ ప్రకటనా స్వేచ్ఛ లేకుండా చేశారు. అటువంటి నిర్బంధ సమయంలో గ్రామాల్లో మహిళలను రహస్యంగా వారి కష్టాలను అడిగి తెలుసుకుని, మీకు ఐద్వా అండగా ఉంటుందని ధైర్యాన్ని చెప్పింది. ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి.రమాదేవి, జిల్లా కార్యదర్శి సిహెచ్. రమణితో పాటు 8 మంది జిల్లా కమిటీ సభ్యులు గ్రామాలు పర్యటించటంతో పాటు గ్రూపు మీటింగ్స్ ఏర్పాటు చేసి ధైర్యం చెప్పారు.

**144 సెక్షన్ ఎత్తివేయాలని పాదయాత్ర:**

60 రోజులు పైబడి 144 సెక్షన్ కొనసాగగా తమకు నిర్బంధం ఏమిటని, చుట్టాలు ఇంటికి వచ్చినా ఆరాలు తీస్తారా అని మథనపడుతూ ప్రభుత్వం, పోలీసులకు తమ నిరసన తెలపాలని నిర్ణయించుకుని, దివీస్ పరిశ్రమ ఏర్పాటు విరమించాలని డిమాండ్ చేస్తూ 200 మంది మహిళలు అక్టోబర్ 20న 6 గ్రామాల్లో "ఐద్వా"

ఆధ్వర్యాన పాదయాత్ర నిర్వహించారు. 50 మంది పోలీసులు పాదయాత్రను అడ్డుకుని ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు బి.ప్రభావతి, జిల్లా కార్యదర్శి సీహెచ్.రమణి సహాయ కార్యదర్శులు సునీత, టి.నాగ వరలక్ష్మిలను టార్గెట్ చేసి జుట్టుపట్టి లాగివేసి అరెస్టులు చేస్తుంటే మహిళలంతా అడ్డుకుని పోలీసులపై తిరగబడ్డారు. దీనితో పోలీసు వెనక్కి తగ్గి పాదయాత్ర విరమించాలుని బుజ్జగింపు ధోరణిలోకి వచ్చారు. దీనితో మహిళలు "పాదయాత్ర చేస్తాం. ముందుకు వెళతాం లేదా అరెస్టు చేస్తే జైలుకైనా సిద్ధం" అంటూ ముందుకు కదిలారు. 144 సెక్షన్ ఎత్తివేయాలని పట్టుబట్టారు.

నాయ కత్వాన్ని అరెస్టు చేయడానికి ప్రయత్నిస్తే "ముందుగా మమ్మల్ని అరెస్టు చేయండి, నాయకుల్ని అరెస్టు చేయకండి" అంటూ ఎదురుతిరిగారు. పోలీసులు అరెస్టు చేసి లారీ ఎక్కిస్తుంటే అర్ధగంటపాటు లారీని కదలకుండా అడ్డగించారు. 60 మంది మహిళలను అరెస్టు చేసి అన్నవరం పోలీసు స్టేషన్‌కి తరలించారు. స్టేషన్‌లో బాత్రూమ్ సౌకర్యం కోసం పోలీసులను డిమాండ్ చేశారు. అరెస్టు చేసిన వారిని రాత్రి 7 గంటల సమయానికి వదిలిపెట్టగా ఇంటికెళ్లిన మహిళలు 144 సెక్షన్‌ని ధిక్కరించామని గ్రామంలో విజయోత్సవ ప్రదర్శన రాత్రి 9 గంటల వరకు నిర్వహించారు. దివీస్ ప్రాంత వాసి గోవిందుని అరెస్టు చేశారని తెలుసుకున్న ప్రజలు 6 కి॥మీ నడిచి ఒంటిమామిడి స్టేషన్‌కు 200 మంది చేరుకొని పోలీస్ స్టేషన్‌ను ముట్టడించారు. గోవిందుని విడిచి



ఎ. సుశీల



కె. సంధ్య



బండి మంగ



ఎం.నాగకృష్ణవేణి

పెట్టడంతో మరో విజయం సాధించారు. ప్రజలు ఐకమత్యంతో కదిలితే పోలీసు యంత్రాంగం సెక్షన్‌లు ఏమీ చేయలేవని తమ సొంత అనుభవం నుండి గ్రహించారు.

**అరెస్టులు, నిరసనలు :**

దివీస్‌లో 6 సార్లు పోరాటం జరిగింది. వందలాది మంది మహిళలు పాల్గొన్నారు. అన్ని పోరాటాల్లోనూ 400 మంది పైగా మహిళలు అరెస్టయ్యారు. ఎక్కువసార్లు అరెస్టయిన వారు 200 మందికి పైగా వున్నారు. మహిళల్లో చైతన్యం పెరిగిన తర్వాత ఉద్యమం ఊపందుకుంది. వారిలో పోరాట పటిమ పెరిగింది. "ఐద్వా" వచ్చి మాకు ధైర్యం చెప్పింది. మా వెన్ను తట్టింది. మా కోసం నాయకులు అరెస్టులు అయ్యారు. మా ఇళ్లలోనే ఉంటూ, మేం పెట్టింది తింటూ వారి కుటుంబాలను వదిలి మా కోసం వచ్చారు అంటూ నాయకులను అక్కున చేర్చుకున్నారు.

**ఐద్వా కృషి :**

ప్రాణాలైనా ఇచ్చి దివీస్‌ని వ్యతిరేకిస్తాం అంటూ మహిళలు ముందుకు రావడానికి "ఐద్వా" దివీస్ ప్రాంత మహిళలకు ఇచ్చిన ప్రోత్సాహం, చైతన్యం కారణం. సెప్టెంబరులో మొట్టమొదట ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి, జిల్లా కార్యదర్శి సిహెచ్.రమణి సహ కార్యదర్శులు కె.సుభాషిణి, జి.సునీత, టి.నాగవరలక్ష్మి, శ్రామిక మహిళా రాష్ట్ర నాయకురాలు జి.బేబీరాణి దివీస్ పోరాట గ్రామాల్లో పర్యటించి మహిళలను కూడగట్టి, రహస్య మీటింగ్స్ ఏర్పాటు చేసి వారికి ధైర్యాన్నిస్తూ అవగాహన కల్పించారు. వారికి ఐద్వా అండగా వుంటుందని భరోసా ఇచ్చారు. రహస్య సమావేశాలను పోలీసులు చెదరగొడుతుంటే పోలీసులను నాయకత్వం ప్రశ్నించిన తీరు, ఎదిరించిన తీరు సామాన్య మహిళల్లో ఉత్తేజం తీసుకొచ్చింది. ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి రహస్య మీటింగ్స్ ఏర్పాటుకు 10 మంది స్థానిక మహిళలు సహకరించారు. సంధ్య, కృష్ణమ్మ, సుశీల, మంగ, బేబీ, కళ్యాణి, అప్పల నర్స, లక్ష్మి, వరలక్ష్మిలున్నారు.

రాష్ట్ర కార్యదర్శి సహకారం, కృషి ఉద్యమానికి ఉపయోగపడింది. ఈ కాలంలో 4 ఐద్వా కమిటీలు ఏర్పడ్డాయి. 300 మంది మహిళలు "ఐద్వా" సభ్యులుగా చేరారు. ఒక రోజు 40 మందికి రమాదేవి క్లాసు బోధించారు. ఈ కృషి మహిళల్లో చైతన్యాన్ని నింపింది. ఈ స్ఫూర్తితో మహిళా సమస్యలపై కూడా కదులుతామని కమిటీ సభ్యులు తెలియజేశారు.



విశ్లేషణ

# "నీకేం కావాలో-నువ్వే తేల్చుకో"

- డాక్టర్ డి.శమంతకమణి

"సినిమా" లు ఎవరైనా ఎందుకు చూస్తారు? కాలక్షేపం కోసమా? కాస్తంత వినోదం కోసమా? కాక కాస్త విజ్ఞానాన్ని ఆర్జించుకుందామనా? ఎవరి కారణాలేవైనా సినిమా మాత్రం ఓ పవర్‌ఫుల్ మీడియా. ఉత్తరాది మార్కెట్, గ్లోబల్ మార్కెట్ కాబట్టి, భారీ తారాగణమున్నా లేకున్నా, భారీ స్థాయిలో ఉంటాయి. కథాపరంగా వైవిధ్యంతో పాటు కాస్టీగా తేవడానికి కష్టపడతారు...

దక్షిణాదిన భిన్నంగా ఉంటాయి. వాస్తవికతకు అత్యంత సన్నిహితంగా మలయాళ మూవీలు అగ్రస్థానంలో ఉండగా, నేటివిటికీ దగ్గరగా ఉంటాయి కన్నడ సినిమాలు. తెలుగు, తమిళం సినిమాలు వాస్తవాలకన్నా, కాస్త దూరంగా జరిగి, సమాజం పట్ల బాధ్యత కన్నా, కల్పన పేరుతో, ఎక్కువగా ఊహాలోక విహారం చేస్తాయి. ఈ ట్రెండ్‌కి భిన్నంగా ఈ మధ్య కొన్ని సినిమాలొచ్చాయి. మళయాళ సూపర్‌స్టార్‌లు మమ్ముట్టి, మోహన్‌లాల్ తెలుగులో ప్రత్యక్షమయ్యారు. మీరా జాస్మిన్, రమ్యకృష్ణల కాంబినేషన్‌లో సోషల్ సైంటిస్ట్ పాత్రలో మమ్ముట్టి నటించిన "సంగమం", గౌతమి, ఊర్వశిలు సహ నటులుగా ఓ షాపింగ్ మాల్ అసిస్టెంట్ మేనేజర్ పాత్రలో మోహన్‌లాల్ నటించిన "మనమంతా" సినిమా. ఈ రెండు పాత్రలు మన తెలుగు హీరోలు ఖచ్చితంగా నటించడానికి అంగీకరించనివి.

మూడోది షార్ట్ ఫిల్మ్. నేపథ్య గాయనిగా, డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా పేరుగాంచిన సునీత ప్రధాన పాత్రలో వచ్చిన సినిమా "రాగం" మూడు సినిమాల కథాంశాలు మూడు కోణాలు. అయితే అన్నింటా స్త్రీలే ప్రధాన పాత్రలు. కథలో కీలకాం శాలు. మహిళల భావోద్వేగాల పట్ల, అత్యంత సున్నితమైన అంశాల పట్ల ఎంతో శ్రద్ధ వహించి భారతీయ సమాజం లోని స్త్రీల సమస్యలను, అడ్డంకు లను, అధిగమించ వలసిన సమస్యలను చర్చిం చాయి. వాటినోసారి పరిశీలిద్దాం!




ఈ వ్యాసంలో పాత్ర పేర్లు కన్నా, నటీనటుల పేర్లు ప్రస్తావించడమే సబబు. కారణం అందరూ నటించలేదు, జీవించారు గాబట్టి కథాంశాలు పరిశీలిద్దాం.

**సంగమం** : కంపెనీ లాకౌట్ వలన సంవత్సరంన్నరగా ఉద్యోగం లేని భర్త. ప్రేమ వివాహం వలన కుటుంబాలు దూరమైతే , ఉత్తరాదిన ఒంటరి సంసారం. భాషరాదు. పసిబిడ్డ. ఉద్యోగాన్వేషణలో భర్త బెంగుళూరు వెళ్ళిన సమయంలో హస్పిటల్‌కి జ్వరమొచ్చినా డబ్బులేక బిడ్డను తీసుకెళ్ళలేని స్థితి.

లిఫ్ట్‌లో పైకెళుతున్నప్పుడు పరస్పర చూపుల పరిచయం. పై ఫ్లోర్‌లో స్వంత ఫ్లాట్‌లో అతను, క్రింద ఫ్లోర్‌లో అద్దింట్లో ఆమె.

కాయిన్ బాక్స్‌లో ఫోన్‌లో బిడ్డ పరిస్థితి చెబుతున్నప్పుడు విన్న ఆ సోషల్ సైంటిస్ట్ తన కార్‌లో హాస్పిటల్‌కు తీసుకెళతాడు. డబ్బు ఇవ్వబోతుంటే తీసుకోవడానికి మొహమాటపడుతుంది. "ఇదేం ధర్మాసుపత్రి గాదు, ట్రీట్‌మెంట్ అయ్యేవరకు ఉండే సమయం లేదు. తిరిగి వెళ్ళడానిక్కూడా డబ్బు అవసరమేగా?" అని నిష్కర్షగా చెప్పేసి వెళ్ళిపోతాడు.

ఉద్యోగ ప్రయత్నంలో విఫలమైన భర్త సంసారం నడపలేకపోతే, చెవి దుద్దులు తీసుకెళ్ళి మమ్ముట్టికిచ్చి , డబ్బు సాయం అడుగుతుంది. నేను తాకట్టులు పెట్టుకోనే వ్యక్తిని కాదు అంటూ , కొంత డబ్బు ఇచ్చి దుద్దులు కూడా వెనక్కి ఇచ్చేసి వీలు కుదిరినపుడు తిరిగి ఇవ్వమనే చెబుతాడు.

ఏదో చిన్న పని చేసి కొంచెం డబ్బు తెచ్చిన భర్తతో మమ్ముట్టి డబ్బు ఇచ్చేద్దామంటుంది. కానీ ఆ భర్త అంగీకరించడు కారణం, ఇంకా ఉద్యోగం రాలేదు, ఆదాయంలేదని .. తిరిగి ఇచ్చేద్దామని పట్టుబట్టిన ఆమెతో, తాను పార్టీకి వెళుతున్నానని, డబ్బు తిరిగి ఇచ్చేయడంతోపాటు తనకొక ఉద్యోగం అడగమంటాడామె భర్త.

మీరా జాస్మిన్ వెళ్ళే సమయానికి, సంపూర్ణంగా త్రాగుతూ ఉంటాడతను... కారణం ఈ ప్రపంచంలో తనకున్న ఏకైక బంధం "పిన్ని" మరణం. నేను సెలబ్రేట్ చేసుకునే మూడ్‌లో ఉన్నానంటూ ఆమె మీద చేయివేస్తాడు. సమాధానం ఉండదు. 'నీకిష్టమైతేనే', బలవంతం లేదు. ఇష్టం లేకపోతే వెళ్ళిపోవచ్చు అంటూ చెపుతాడు. మాట్లాడని ఆమెను చేరుకుంటాడతను. కదలకుండా కూర్చుని ఆలోచనలో పడిన ఆమెను "నీ భర్త క్వాలిఫికేషన్ ఏమిటి" అని అడుగుతాడు.

కాలం గడుస్తున్న సమయంలో

సంఘర్షణకు లోనవుతుందామె. కారణం "ఒకే ఒక్కసారి కలసినా" అతనిని వదిలి బ్రతకలేని స్థితికి ఆమె చేరుతుందామె. అదే సమయంలో ఆమె రెండవసారి గర్భవతవుతుంది.

చిన్నవయస్సులో గొడవలు పడి, విడిపోయిన తల్లి తండ్రి, మేనమామ తనపై అత్యాచారం చేయగా 15వ ఏటనే తల్లయ్యి, బిడ్డకు పాలు లేక, పనికోసం వెళ్ళి డబ్బులు సంపాదించుకొనే సమయంలో ఆకలితో డొక్కలెగసి మరణించిన పసికూన వలన ప్రపంచంపై ఏహ్యతతో మానవ సంబంధాల పట్ల ఏమాత్రం నమ్మకం లేక, "శారీరక అవసరం కోసమే మగవాడు'' అన్న నమ్మకంతో, జీవిక కోసం ఓ చిన్న రెస్టారెంట్ నడుపుకునే రమ్యకృష్ణ...

మమ్ముట్టి, రమ్యకృష్ణ కేవలం బెడ్‌మేట్స్ మాత్రమే గాక, కష్ట సుఖాలు కూడా మాటల్లో పంచుకునే మనుష్యులు. గర్భంతో తనను చూడటానికి వచ్చిన మీరాను చూసి గర్భవతిని చూడటం ఇదే తొలిసారంటూ సంబరపడి, చిన్న బిడ్డలా ఆమెను చేరతాడు ఆ సోషల్ సైంటిస్ట్.

"మిమ్మల్ని వదిలి నేను బ్రతకలేక పోతున్నాను. మీతోనే ఉంటాను" అంటుందామె. "ఇద్దరి బిడ్డల తల్లివయిన నీకు ప్రేమ, అనురాగం ఇలాంటివి ఉండకూడదు. పిల్లలే నీ ప్రపంచం డెలివరీకి డబ్బులు కావాలంటే తీసుకో అంటాడు.

ఏం మాట్లాడకుండా మౌనంగా వెళ్ళిపోతుందామె.

జరిగిన సంఘటన విన్న రమ్యకృష్ణ అంటుంది "నీకర్థం కాలేదా? ఆ బిడ్డకు తండ్రివి నీవు. ఆ మాట చెబుదామని వచ్చిందామె అని" మ్రాన్పడిపోతాడా సైంటిస్ట్

మీరా జాస్మిన్ కుటుంబం వేరేచోటకు అద్దెకు తరలిపోతుంది. కొంత కాలం లండన్ వెళతాడు మమ్ముట్టి. కానీ "ఆమె" అతని జ్ఞాపకాల్లో నిత్యం ఉండటం వలన భరించలేక మరింత తాగుబోతవుతాడు. కొంతకాలం తర్వాత, ఇండియా తిరిగొచ్చిన సైంటిస్ట్‌ను ఓ రోజు బార్‌లో పడిపోయి ఉండటం చూస్తాడు మీరా జాస్మిన్ భర్త. తన భార్య పరిస్థితి బాగాలేదని, మీ మాట తప్ప మరెవ్వరి మాట వినదని, వీలు చూసుకొని ఓసారి ఇంటికి రమ్మని, విజిటింగ్ కార్డ్ ఇచ్చివెళ్ళిపోతాడు.

ఆమెను చూడటానికెళ్ళినతనికి అర్థవుతుంది. ఆమెకు మతి భ్రమణం జరిగిందని, అతనికి తెలిసిన మనోవ్యాధుల ఆశ్రమంలో చేర్పుతారు. నాలుగేళ్ళు గడచి పోతాయి. అతను మరింత త్రాగుబోత వుతాడు. ఆమె కోలుకుంటుంది.

ఇంటికొచ్చినామెకు అర్థమవుతుంది. పసికూనగా తాను వదలిపోయిన రెండోబిడ్డను పక్కింటావిడ పెంచుతుందని తనకు గతంలో జరిగిన కథే ఆ పక్కింటావిడకు, తన భర్తకు మధ్య జరుగుతుందని, అన్నీ అర్థం అయినా నిర్లిప్తంగా ఉంటుందామె. కానీ ఆమెను మోహించిన ప్రక్కింటావిడ భర్త అత్యాచారం చేయబోగా తప్పించుకుంటుంది.

ఆ తర్వాత ఓ నిర్ణయానికొచ్చి బిడ్డలిద్దరినీ తీసుకుని, వాళ్ళను లిఫ్ట్ దగ్గర క్రింద వెయిట్ చేయమని "సైంటిస్ట్‌ని" వెతుక్కుంటూ వెళుతుంది.

"ఒకరికొకరు తమకేం కావాలో అర్థం చేసుకుంటారు. ఒకప్పుడు మానవ సంబంధాల పట్ల అణుమాత్రం నమ్మకం లేని అతను, ఆమె లేనిదే జీవితంలో ప్రశాంత లేదని తెలుసుకుంటాడు.

మతి భ్రమణం జరిగి, మామూలు స్థితికొచ్చినా, తన మనస్సులో అతని స్థానం సుస్థిరంగా ఉందని అతను లేనిదే బ్రతకలేనని ఆమె తెలుసుకుంటుంది.

వీరిద్దరూ మాట్లాడుకొనే లోపల పిల్లలిద్దరూ మెట్లు ఎక్కి పైకి వస్తారు. ఆ బిడ్డలను అతను ఆలింగనం చేసుకోవడంతో కథ ముగుస్తుంది.

**మనమంతా**: స్టాక్ బాయ్ నుండీ అంచెలంచెలుగా ఎదిగి అసిస్టెంట్ మేనేజర్ స్థాయికి, ఓ షాపింగ్ మాల్‌లో ఎదిగిన ఓ గ్రాడ్యుయేట్. 8వ తరగతి చదువుతూ... ప్రపంచమంతా ఆనందంగానే ఉంటుందని, తనలాగే అందరూ చదువుకోవాలని ఆలోచించే ఓ పాప. భర్త చేసే ఉద్యోగానికి చేదోడువాదోడుగాకున్నా, తానేమిటో నిరూపించుకోవాలని చీరల వ్యాపారం చేసే ఓ మధ్య తరగతి మహిళ. అమ్మా నాన్నలు ఎంత కష్టపడి తనను చదివిస్తున్నారో తెలిసి, తానుకూడా ఎంతో ఇష్టంతో చదువు కొనసాగిస్తూ క్లాసులో ముందుండే ఓ ఇంజనీరింగ్ విద్యార్థి. డిగ్రీలో గోల్డ్‌మెడలిస్ట్ అయినా, సంసార ఝంఝాటంలో తన శక్తియుక్తులు మరచిన ఓ గృహిణి. పిల్లలకు చదువుతోపాటు, మంచి చెడులను కూడా వివరించే ఓ స్కూల్ మాస్టారు. కష్టమర్లతో ఇంగ్లీష్‌లో మాట్లాడుతూ, వ్యాపారం పెంచే దిశలో తన శక్తియుక్తులా ప్రయత్నించే ఓ అసిస్టెంట్ మేనేజర్. ఇవే పాత్రలు.

రూపాయి రూపాయి దాచి అమ్మా నాన్న కొన్న ల్యాప్‌టాప్ అంటే అమిత ఇష్టం. కానీ కాలేజీలో పరిచయమైన ధనవంతుల ఇంటి బిడ్డ తనతో స్నేహం సాగించినపుడు అది ప్రేమ అని భ్రమపడి వస్తు వినిమయ సంస్కృతిలో "టచ్‌స్క్రీన్" ఫోన్ కోసం లాప్‌టాప్ అమ్ముకునే కుర్రాళ్ళకు ఓ గుణపాఠం. స్నేహం, ప్రేమ వేరని ఈనాటి తరం అమ్మాయిలు ప్రేమ, పెళ్ళి కన్నా ఉన్నత విద్యకై విదేశాలకు వెళుతూ, కెరీర్‌కే అగ్రపీఠం వేస్తారని అర్థం చెప్పే సందర్భం.

అమ్మా నాన్న రోజంతా కష్టపడ్డా, కడుపు నిండని కుటుంబంలో, పగలంతా తనను కాపలా కాసే అక్కా, తాను స్కూలుకు ఎందుకు వెళ్ళలేరో అర్థంకాని పసికూనతో

అంతస్థుల అమరికలు తెలియని స్నేహంతో, ఎలాగైనా ఆ పిల్లాడిని చదివించాలని ఆ పదేళ్ళ పాప తాపత్రయం.

ఎలా తప్పిపోయాడో లేక ఎవరన్నా దొంగిలించారో తెలియక, తనకేమీ కాకపోయినా తన స్థాయిలో వెతుకులాటలో చేసే ప్రయత్నాలు.

తనకు ఎమ్.బి.ఏ లేదు గాబట్టి, ఇంటర్వ్యూ టైమ్‌లో తనతోటి అసిస్టెంట్ మేనేజర్‌ని లేకుండా చేస్తే తనకే ఆ అవకాశమని భావించి 5వేల రూపాయలకు కిడ్నాప్ మాట్లాడుకొని, ఆ రౌడీ లక్షన్నర ఇస్తే తప్ప వదలనని, మనిషిని ఎక్కడ దాచాడో చెప్పకుండా, సడన్‌గా గుండెజబ్బుతో చనిపోతే, తన సహోద్యోగి కుటుంబం వేదన చూడలేక శక్తికి మించి ప్రయత్నించే మధ్య తరగతి మనిషి.

చీరల వ్యాపారంలో లాభం కన్నా మిగిలితే కట్టుకోవడంలోనే నష్టమెక్కువని తెలుసుకున్న మహిళ. "నీవు చేసిన సాయానికి ప్రతిఫలంగా, నీకేం కావాల్సినా కొనుక్కో ... కానీ అది చూసి నీ పెదాలపై చిర్నవ్వు రావాలి అన్న" తన ప్రొఫెసర్ కండిషన్‌పై తనకేం కావాలో తేల్చుకునే క్రమంలో, స్వంత ఇంటి దగ్గర నుంచే, టివి, ఫ్రిజ్ బంగారం, వజ్రాలు ఇవేమీ తనకు ఆనందాన్నివ్వవని గ్రహించే ఆ మధ్య తరగతి మహిళ.

ఉద్యోగం సింగపూర్‌లోనని, తత్కాల్ పాస్‌పోర్ట్‌పై ప్రయాణం అయ్యే సమయంలో ఎయిర్‌పోర్ట్‌కి ఎవ్వరూ రాని సమయంలో తన చిర్నవ్వు ఎక్కడుందో అర్థం చేసుకున్న ఆ అమ్మ.

భార్యా, భర్త, కొడుకు, కూతురు ఆఖరి నిముషం వరకూ కలసి కన్పించని స్క్రీన్‌ప్లే "మనమంతా" ఒక సినిమా కాదు మన చుట్టూ ఉన్న సమాజంలోని మన పాత్రలే వెంటాడతాయి. వేదనకు గురిచేస్తాయి. జీవన వేగంలో మనలను మనం ఎలా కోల్పోతున్నామో, తెలియజేస్తాయి.

**రాగం :** సృష్టికి అంతం స్త్రీ పురుషులు లేదా ఆడా..మగా జంటనే విలువ "ఒంటరి"గా ఉంటే తంటా...

ముఖ్యంగా భారతీయ సమాజంలో మగవారి ఒంటరి జీవితాన్ని అత్యంత సహృదయంతో స్వీకరించే వ్యక్తులు... కారణాలేవైనా 'ఒంటరిగా' జీవించే మహిళల పట్ల మాత్రం కఠినంగానే ఉంటారు.

ముందొక మాట వెనుకొక వంకర మాటలతో, తమ పైశాచిక ప్రవృత్తిని, మానసిక వైకల్యాన్ని పదే పదే ప్రకటించు కుంటూ తమ అల్పత్వాన్ని తెలుపుకుంటూ ఉంటారు.

అసలు మహిళ ఒంటరిగా ఉండట మేమిటి? మంచి బట్టలేసుకోవడ మేమిటి? ధైర్యంగా ఒక్కతే జీవించడమేమిటి? మగవారితో స్నేహమేమిటి? ఎన్ని ప్రశ్నలు, ఎన్ని కనుబొమ్మలు పైకి లేవడాలు...

ప్రేమించి పెళ్ళి చేసుకున్న సహ గాయకుడు భార్యకొచ్చిన అవకాశాలను భరించలేక 'మహిళ' గాబట్టి అవకాశం పొందిదన్న అనుమానంతో జీవితాన్ని ఛిద్రం చేస్తే, ఇష్టమైన సంగీతాన్ని వదులుకున్న, భర్త కోసం రాజీపడినా, జీవితం దుర్భరమైన సమయంలో అనివార్యంగా విడిపోతుందామె.

మనస్సుకి స్వాంతననివ్వకపోయినా జీవిక కోసం ఓ ఛానల్‌లో పనిచేస్తూ ఒంటరిగా బ్రతికే ఆమెపై సమాజం రువ్వే రాళ్ళు ఎలా ఉంటాయో హృద్యంగా చూపారు ఈ షార్ట్ ఫిల్మ్‌లో.

తన వ్యక్తిగత జీవితానికి దగ్గరగా ఉన్న సినిమాగా సునీత వర్ణించిన ఈ షార్ట్ ఫిల్మ్ దాదాపు ఒంటరి మహిళలందరి జీవన చిత్రమే.

భారతీయ సమాజంలో ఒంటరి మహిళల పట్ల మారాల్సిన దృష్టి కోణాన్ని చర్చించింది "రాగం".

మూడు సినిమాలలో మహిళలే ప్రధాన పాత్రధారులు. భర్తతో కాపురం చేస్తూ ఆకలి కష్టాల సంద్రాన్ని ఈదే క్రమంలో పరిచయమైన అపరిచితుడుతో తాను ఎందుకు సంగమంలో పాల్గొందో, అతనిపై అపరిమిత ఇష్టం ఎందుకు పెరిగిందో, అర్థం చేసుకొని ఆమె అతన్ని వదులుకోవటంలో సంఘర్షణకు లోనై మతి పోగొట్టుకున్న మహిళగా మీరా జాస్మిన్ అత్యద్భుతంగా నటించిన పాత్ర నిజ జీవితంలో కూడా తారసపడతాయి. కొన్ని బయట పడతాయి. కొన్ని పడవు. సంగమం శారీరకమైన, మానసిక బంధం ఏర్పడటానికి సంవత్సరాలు కలిసి కాపురం చేయఖ్ఖర్లేదని "ఆమె" తనను తాను తెలుసుకోవడానికి కొన్ని సంఘటనలు దోహదపడతాయని, తన లైంగిక అవసరం కన్నా మానసిక బంధమే బలమైనదని, సాధారణ యువతి వైవాహిక బంధాన్ని తెంచుకుని "తనకేం కావాలో" తెలుసుకొని వెళ్ళిపోతుంది. భర్త కూడా అదే స్థితిలో ఉన్నాడు గాబట్టి తాను చేసిన పని తప్పుగా భావించడు.

ఎంత చదువుకున్నా, కుటుంబానికి కీలకంగా చక్రంలా వ్యవహరించడంలోనే తన సంతోషం, చిర్నవ్వు ఉన్నాయని తెలుసుకుంటుంది గౌతమి. ఆమె లేనిదే తమకు మనుగడ లేదని, సంపాదన కన్నా సహచర్యంలోనే ఆనందం ఉందని తెలుసు కుంటారామె కుటుంబ సభ్యులు.

కాలికి రాని చెప్పులో నడక ఎంత దుర్భరమో, అలాగే ప్రేమించి పెళ్ళి చేసు కున్న వంకర మనసు భర్తనుండి విడిపోయి, ఈ ప్రపంచానికి తన శక్తి యుక్తులను ప్రకటించాలనుకుంటుంది సునీత.

మూడు పాత్రలూ ఇచ్చే సందేశం ఒక్కటే "మహిళలు- తమకేం కావాలో తామే నిర్ణయించుకోవడం".



కథ

# పితృత్వం ఒక బాధ్యత!

-ఆర్. దుర్గా ప్రసన్న

చెట్టూ, పుట్ట కరువైన ఈ కాంక్రీటు అడవిలో పక్షులు, క్రిమి కీటకాల మనుగడ కష్టమే. భూమి మీద పుట్టిన ప్రతి ప్రాణికీ మరణం ఎంత సహజమో కదా! అయినా ఆకలి, దాహం, స్వేచ్ఛ, జతకట్టడం, సంతానాన్ని అభివృద్ధి చేసుకోవడం పుట్టుక తోనే గ్రహించేసుకుంటాయి. నారు పోసిన వాడే నీరు పోస్తాడని నానుడి. నేను మాత్రం పక్షులకి ఏదో ఉడతా భక్తిగా నీరందించే నియమం పెట్టుకున్నాను. అందువల్ల ఎప్పుడైనా మర్చి పోయినా, ఇంటికి తాళం పెట్టి ఏ ఊరయినా వెళ్లినా 'అయ్యో పక్షులకి నీరు ఎలా?' అనే ఆలోచన వస్తూ ఉంటుంది.

పావురాలు రోజూ నీరు తాగి వెళ్తూ ఉంటాయి. నీళ్లు లేకపోతే చిన్న శబ్దాలు చేస్తూ నీళ్ల గిన్నె ఖాళీ అయిందనే సంకేతాలిస్తూ ఉంటాయి. ఇంకో పక్క పావురాలు ఇంటి లోపలికి రాకుండా ఏర్పాటు చేసిన ఓ అద్దాల కిటికీలో మెల్లిగా కాపురం పెట్టాయి పావురాల జంట. జంటగా వచ్చేవి, జంటగా ఎగిరిపోయేవి. కొన్నాళ్లకి చిన్న చిన్న చితుకులు తెచ్చి గుండ్రంగా పేర్చినపుడు ఆ సంగతి అర్థం అయింది. మరి కొన్నాళ్ళకు పావురం ఒక గుడ్డుని పెట్టింది. దాన్ని అపురూపంగా చూసుకునేవి. ఆడ పావురం (అనుకుంటా) ఎప్పుడూ గుడ్డు మీదనే కూర్చునేది. హుష్ హుష్ అంటూ అదిలించినా అది కొంచెం అటూ ఇటూ జరుగుతుందే తప్ప బయటికి ఎగిరి పోయేది కాదు. కొన్ని సార్లు రెండు పక్షులు ముక్కు, ముక్కూ రాసుకుని ఏవో కబుర్లాడుకొనేవి. అప్పుడప్పుడు గుడ్డుని వదిలి బయటకు వెళ్లి వచ్చేవి. ఎన్నాళ్లిలా ఆ గుడ్డుని వదలకుండా పట్టుకుంటే పిల్ల అవుతుందీ! అని నాకు ఒకటే ఆశ్చర్యం.

మరి కొన్నాళ్లకి ఆడపక్షి అస్సలు కదలకుండా ఉండిపోయింది. ఈలోగా గాలీ వాన తుఫాను తుంపరలు పడుతున్నా పాపం ఆ ఆడపక్షి కదలకుండా ఒక మూలకి



ఒరిగిపోయి ఉండిపోయింది. మగపక్షి వస్తుంది వెళ్తూంది. మరి ఆహారం? నేను మూసిన ఆ గాజు తలుపులను తెరవడానికి వీలు లేదు. పక్షుల గురించి ఏ అవగాహన లేని పట్నవాసిని. ఉధృతమైన గాలి వానకి, జల్లుకి కొంచెం పక్కగా జరిగినపుడు తెలిసింది. అద్భుతం! గుడ్డు పగిలి చిన్న పిల్లగా ఉంది. ఆడ పావురం ఆ పిల్లని పాదాలతో హత్తుకుని రెక్కలతో కప్పేసింది. పుట్టగానే పాలు పట్టే ఏర్పాటు లేదు. ఆహారం అందించే వెసులుబాటూ లేదు. తల్లి పక్షి వెచ్చని కౌగిలింతే పిల్ల పక్షికి అన్నీను.

మగపక్షి రోజూ వస్తుంది, వెళ్తూంది. ఆహారం ఏమైనా తెచ్చి తల్లి పక్షికి పెడుతుందా? ఏమో! పిల్ల పక్షినైతే ముద్దులాడే పరిస్థితి లేదు. అయినా ఎంత బాధ్యత! ఆడపక్షితో సరాగాలాడి అది గుడ్డుని పెడుతుందని తెలుసుకొంది. గూడు ఏర్పాటు చేసింది. ఆ గుడ్డు పిల్ల అయ్యేదాక దాని వెంటే ఉంటుంది.

ఇవన్నీ పక్షికి ఎలా తెలిశాయి? ఏ సంఘానికి భయపడి చేస్తుంది? ఏ చట్టాలు దానికి ఈ నిబద్ధతను కల్పించాయి? ఆ ఆడ పక్షి అన్యాయం చెయ్యవద్దని వేడుకోలేదే! అయినా ఆ మగ పక్షి ఎంత బాధ్యతగా ఉంది. గుడ్డు పిల్లయి దానికి రెక్కలు వచ్చేవరకూ ఎంత భరోసా ఇచ్చింది ఆ తల్లీ పిల్లకు..!

నాగరికత ఎరిగిన మనిషి, మంచి–చెడు విచక్షణలనెరిగిన మనుష్యులు ఎందరినో చూస్తున్నాం. గర్భవతులైన భార్యల్ని, రెక్కలు రాని తమ పిల్లలని గాలికి వదిలి, తమ తమ బాధ్యతలని మరచి మానవత్వానికి మచ్చ తెస్తున్నారే? నోరు తెరిచి న్యాయాన్యాయాన్ని అడిగితే చట్టాల్లోని లొసుగుల్ని ఆసరాగా చేసుకుం టున్నారు. రోజూ ఆహ్లాదంగా, ఉత్సాహంగా గమనించే నాకు ఎందుకో చాలా భారంగా తోచింది. నిత్యం భర్తల బాధ్యతారాహిత్యాన్ని ప్రశ్నించే మహిళలూ, మనోవర్తి కోసం న్యాయస్థానాలను ఆశ్రయించే మాతృమూర్తులు, ధర్మపత్నులూ నాకళ్ల ముందు నిలిచారు. OO

ఆరోగ్యం

# పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్

- డా॥కె. భారతీసాగర్

మహిళలు నెలసరి సమయంలో పొత్తికడుపు నొప్పితోనో, ఎక్కువ రక్త స్రావంతోనో వైద్యుల దగ్గరికి వెళ్ళినపుడు కొన్నిసార్లు వారికి గర్భ సంచికి లేదా అండాశయాలు, అండవాహికలు, పెల్విస్ (పొత్తికడుపు)లో ఇన్ఫెక్షన్ వచ్చింది అని చెబుతారు. దీనిని వైద్య పరిభాషలో 'పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్' అని అంటారు. దీని వివరాలను తెలుసు కుందాము. యోనిలో వచ్చే ఇన్ఫెక్షన్ల గురించి విన్నాం కదా, అదే ఇన్ఫెక్షన్లు గర్భసంచి, అండాశయాలు, అండ వాహికలు, పొత్తి కడుపులోని భాగాలకు వస్తే దానినే పీఐడీ(పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్) అంటారు. యోనిలో సాధార ణంగా ఆశ్రయించి ఉండే సూక్ష్మజీవులు రోగి శరీర రక్షణ వ్యవస్థలు బలహీన పడిన సందర్భాల్లో పెల్విస్‌లో ఉన్న జననేంద్రియాలకు చేరి పై వ్యాధిని కలిగిస్తాయి. ఇంకా క్లామిడియా, నిస్సీరియా గొనొరియా లాంటివి శారీ రకంగా కలిసినపుడు పురుషుల నుంచి స్త్రీలకు సంక్రమించి వ్యాధిని కలిగి స్తున్నాయి. ముఖ్యంగా ఒకరికన్నా ఎక్కువమంది సెక్స్ భాగస్వాములు ఉన్న వారిలో ఈ ఇన్ఫెక్షన్లు వస్తాయి. ఇంకా అపరిశుభ్ర వాతావరణంలో సరిగా స్టెరిలైజ్ చేయని సాధనాలతో



గైనకాల జిస్టులు డి అండ్ సి లాంటి ప్రకియలను చేసినపుడు ఐయు సిడిలు అంటే కావర్‌టీ లాంటి లూప్‌లు వేయించుకున్నపుడూ వస్తాయి. అపరిశు భ్రమైన వాతావరణంలో అరక్షితమైన పద్ధతులలో ప్రసవం లేదా గర్భ స్రావం లాంటివి చేసినపుడు కూడా అధికంగా ఇన్ఫెక్షన్లకు ఆస్కారం ఉంటుంది.

ఈ ఇన్ఫెక్షన్లకు కారణమైన సూక్ష్మ క్రిములు స్టాఫైలోకొక్కస్ లాంటి గ్రామ్ పాజివ్ క్రిములు, ఈకోలి, సూడోమోనాస్, క్లెబ్‌సియల్లా, నిస్సీరియా గొనోరియా లాంటి గ్రామ్ నెగెటివ్ క్రిములు లాంటి ఏరోబిక్ బాక్టీరియా, సెప్టోకొక్కస్, క్లాస్ట్రిడియమ్ వెల్లి, కా.టిటాని లాంటి గ్రామ్ పాజిటివ్ బాక్టీరియా, బాక్టీరియాయిడ్స్ లాంటి గ్రామ్ నెగటివ్ ఎనరోబిక్ బాక్టీరియాలు సాధారణంగా ఈ వ్యాధికి కారణాలు.

ఇవి కాకుండా లైంగిక సంక్రమణం ద్వారా వచ్చే గోనోరియా, క్లామేడియా, సిఫిలిస్ కారక క్రిములు, హెర్పిస్ సింప్లెక్స్, హూమన్ పాపిల్లోమా, హెచ్.ఐ.వి. లాంటి వైరల్ ఇన్ఫెక్షన్లు, ట్రికోమోనాస్ లాంటి పరాన్నజీవులు, కాండిడ్ లాంటి ఫంగల్ ఇన్ఫెక్షన్లు, జననేంద్రియాలలో టీబీని కలిగించే మైకో బాక్టీరియం లాంటి ఇన్ఫెక్షన్లు కూడా ఈ వ్యాధికి కారణ భూతాలు.

**లక్షణాలు:-** నెలసరి ముగిసిన వెంటనే ఈ లక్షణాలు కనబడతాయి. అవి ఏమంటే పొత్తికడుపులో సన్నగా మెలి తిరిగినట్లుగా ఉండే నొప్పిగా మొదలై తీవ్రమైన నొప్పిగా మారటం. జ్వరం,

తలనొప్పి, వాంతులు కావటం లేదా వాంతి వచ్చినట్లుండటం, యోని నుంచి నీళ్ల లాంటి స్రావాలు రావటం, మొత్తం కడుపులో లేదా కుడివైపు పై భాగంలో నొప్పి రావటం, యోని నుంచి క్రమరహితంగా రక్తస్రావం లేదా నెలసరి సమయంలో అధిక రక్తస్రావం కావటం, లైంగిక చర్య తరువాత గానీ, పాల్గొనే సమయంలో కాని పొత్తికడుపు, యోని భాగాల్లో అధికంగా నొప్పి రావటం, యోని నుంచి చీముతో కూడిన స్రావాలు లేదా బాగాముద్దగా ఉండే స్రావాలు కానీ వస్తాయి. గొనోరియా వ్యాధికి సంబంధించి ఇన్ఫెక్షన్ వచ్చినపుడు నొప్పి చాలా తీవ్రంగా ఉంటుంది. ఇన్ఫెక్షన్లు మొదట గర్భాశయ అంతర పొర(ఎండోమెట్రియం)ని చేరినపుడు ఎండో మెట్రైటిస్ వస్తుంది. అండవాహికలకు చేరినపుడు ఆ సాల్పింజైటిస్ వస్తుంది. అండాశయాలకు చేరినపుడు ఊఫొరైటిస్ అని అంటారు. ఎండో మెట్రైటిస్ వచ్చినపుడు రక్తక్రసావం అధికంగా అవుతుంది. అండ వాహికల్లో సాల్పింజైటిస్ వచ్చినపుడు ట్యూబు లోపల చీము ఏర్పడి లేదా స్రావాలతో నిండి అక్కడి నిర్మాణాలు అంటే చిన్న తంతువులు దెబ్బతింటాయి.

ఇది వచ్చిన క్రమంలో కొన్నిసార్లు ట్యూబులు మూసుకు పోతాయి. తద్వారా ఇది వచ్చిన స్త్రీలలో వంధత్వం వస్తుంది. ఎండో మెట్రైటిస్ కలిగినపుడు కూడా గర్భం ధరించే అవకాశాలు తాత్కాలికంగా సన్నగిల్లు తాయి. గోనోకొక్కల్ (గనేరియా) లాంటి క్రిములు సంక్రమించినపుడు ఆ ఇన్ఫెక్షన్ కడుపు లోపలనే పైకి పాకి కాలేయం పై భాగంలో పెరిహెపటైటిస్‌కి కలిగిస్తుంది. దీనినే ఫిట్జ్-హగ్-కర్టిస్ సిండ్రోమ్ అంటారు. సాల్పింజైటిస్ ఉన్న వారిలో 5-10% మందిలో ఇది వచ్చే అవకాశం ఉంది.

కొన్ని సందర్భాల్లో ఇన్ఫెక్షన్ల వలన జననేంద్రియాల్లో ఏర్పడిన స్రావాలు గర్భాశయం వెలుపలకు వచ్చి పొత్తి కడుపులో చీము గడ్డల్లాంటివి గానీ అండా శయాల్లో చీము గడ్డల్లాంటివి కానీ ఏర్పడతాయి.

**వ్యాధి నిర్ధారణ:-** ఈ లక్షణాలలో వైద్యుల వద్దకు వెళ్లినపుడు వారు జననేంద్రియాల లోపలి భాగాలను వైద్య పరికరాలతో లోపలికి చేయి ఉంచి పరీక్షిస్తారు. అప్పుడు వారికి వ్యాధిపైన ఒక అవగాహన వస్తుంది. అంటే చేయితో నొక్కినప్పుడు నొప్పి ఎక్కువవడం (టెండర్‌నెస్) గర్భసంచీ పక్కన గడ్డల్లాంటివి ఉండటం మొదలగునవి తెలుస్తాయి. అవసరమైతే ఆ స్రావాలను తీసి సూక్ష్మ క్రిముల నిర్ధారణకు పంపుతారు. ఎందుకంటే ఏ రకమైన క్రిమికి ఏ చికిత్స చేయాలో తెలుసుకోవటానికి. సోనోగ్రఫీ కూడా చేయించవలసి ఉంటుంది. సాధారణంగా ఇఎస్ఆర్, తెల్లరక్తకణాలు పరీక్ష చేయిస్తారు. ఎందుకంటే ఇన్ఫెక్షన్లలో ఇవి పెరుగుతాయి కనుక ఇంకా పరిస్థితి తీవ్రంగా ఉన్నపుడు లాపరోస్కోపీ, కుల్డోసెంటెసిస్ లాంటి పరీక్షలు చేస్తారు.

ఈ పరీక్షలన్నిటి ద్వారా వ్యాధి నిర్ధారణ జరుగుతుంది. ఎందుకంటే పొత్తికడుపులో నొప్పికి ఒక్క పిఐడినే కాకుండా ఇంకా అపెండిసైటిస్, ఎక్టోపిక్ గర్భం, అండా శయంలో వచ్చే నీటి బుడగల కారణంగా మెలిపడటం, తీవ్రమైన మూత్రనాళ ఇన్ఫెక్షన్లు కూడా కారణంఅవుతాయి. పీఐడీ నిర్ధారణకి చేసే పరీక్షల వలన ఇవన్నీ ఉన్నా కూడా తెలిసిపోతుంది. తద్వారా ఔషధ చికిత్సా, శస్త్ర చికిత్సా అనేది నిర్ధారణకు రావచ్చు.

**వ్యాధి ఉపద్రవాలు:-** దీనిని సరిగా చికిత్స చేయకుండా వదిలివేస్తే ఇది తక్షణం పెల్విక్ పెరిటోనైటిస్ లేదా పెరిటోనైటిస్ (కడుపులోని పెరిటోనియం అనే పొరకి ఇన్ఫెక్షన్‌ని, రక్తంలో ఇన్ఫెక్షన్ (సెప్టిసీమియా) ని కలుగచేస్తుంది. తద్వారా ఆర్థరైటిస్ లేదా మయోకాసిస్ కూడా రావచ్చు. కొంత కాలం అలాగే చికిత్స చేయకుండా ఉంటే అండ వాహికలు (ఫాలోపియన్ ట్యూబులు) దెబ్బతిని వంధత్వం వస్తుంది. ఎందుకంటే అండం శుక్రకణంతో కలిసే

కీలకమైన ఫలదీకరణ (ఫెర్టిలైజేషన్) ప్రక్రియ అండవాహికలోనే జరుగుతుంది. కనుక కొన్ని సార్లు అండాశయాలు అండ వాహికలు అతుక్కుపోయి ముద్దగా తయా రవుతాయి. వ్యాధి ఉన్న స్త్రీలు గర్భం ధరించినా కూడా ఎక్టోపిక్ గర్భం రావచ్చు.

**వ్యాధి నిరోధం:-** జననేంద్రి యాలను పరిశుభ్రంగా ఉంచుకోవటం, అత్యధిక శాతం మహిళలకి యోనిని శుభ్రం చేసుకోవాలనే ప్రాథమిక అవగాహన ఉండదు. రోజూ స్నానం చేయటం ఎంత ముఖ్యమో జననేంద్రియాల పరిశుభ్రత కూడా అంతేముఖ్యం. ఇంకా ఇన్ఫెక్షన్ ఉన్న భాగస్వామితో కలయిక జరప కూడదు. తప్పనిసరి అయితే కండోమ్ ధరించాలి.

తెల్లబట్ట అవుతున్నపుడు యోనిలో ఇన్ఫెక్షన్లు ఉన్నపుడు కాపర్‌టీ లాంటి లూప్‌లు వేసుకోకూడదు. లక్షణాలు కొద్దిగా కనబడు తున్నపుడే చికిత్స చేయించుకోవాలి. ప్రసవం కానీ, గర్భస్రావం కానీ, ఇంకా ఏ విధమైన స్త్రీల వ్యాధుల చికిత్స ప్రక్రియలైనా కానీ నిపుణత కలిగిన అర్హతగల వైద్యుల వద్దకే వెళ్ళాలి. వైద్యం ఇంకా 60-70 శాతం మందికి ఈ దేశంలో అందని ద్రాక్షపండే అంటారా? అంటే ఎర్రజెండా పట్టుకోండి. ప్రశ్నించడం నేర్చుకోండి ప్రభుత్వానికి, ప్రభుత్వ వ్యవస్థలకి జవాబుదారీతనం దానికదే వస్తుంది.

**చికిత్స:-**

వ్యాధికి కారణమైన క్రిములు ఏమిటి అన్నది నిర్ధారణ అయినా, అవడానికి ముందైనా విశాల ప్రాతి పదికన పనిచేసే యాంటీ బయాటిక్స్‌ని వైద్యులు ప్రారంభిస్తారు. అలాగే అవసరమైతే వ్యాధి తీవ్రతని బట్టి వీటిని ఇంజెక్షన్ల రూపంలో కూడా ఇస్తారు. వీటిలో ముఖ్యంగా ఇచ్చేవి సెఫలోస్పోరిన్ గ్రూపువి, జెంటామైసిన్, యాంపిసిలిన్, మెట్రోనిడజోల్‌ని తగ్గించే టినిడజోల్ లాంటివి ఉంటాయి. వీటితోపాటు ఇన్‌ఫ్లమేషన్ తగ్గించే NSAID ఔషధాలు సెరాషియో పెప్టడైజ్ లాంటి ఎంజైముతో ఇస్తారు. పరిస్థితి తీవ్రంగా ఉన్నప్పుడు ఆసుపత్రిలో ఉంచి వైద్యం చేయవలసివస్తుంది. పొత్తి కడుపులో గడ్డల్లాంటివి ఉన్నపుడు ఆపరేషన్ చేయవలసి వస్తుంది. అయితే రోగి యాంటి బయటిక్స్‌కి ప్రతి క్రియ చూపి ఇన్ఫెక్షన్ నియంత్రణలోకి వచ్చినపుడే ఇది సాధ్య మవుతుంది. పొత్తికడుపులో ఉన్న గడ్డలని సోనో గ్రఫీతో గర్భాశయా నికి వెనకవైపు కింది భాగంలో ఉన్నా యని నిర్ధారణ అయినపుడు యోని మా ర్గం నుంచి ఆ చీముని తొలగించొచ్చు.

నాటు వైద్యులు దగ్గర గర్భస్రావం లాంటివి చేయించుకున్నప్పుడు తీవ్రమైన పరిస్థితి వచ్చి వికటించినప్పుడు తక్షణం ఆ స్త్రీని ఆసుపత్రికి తరలించాలి. పరిస్థితి తీవ్రంగా ఉంటుంది. కనుక ఆమెకి ఐవీ ద్వారా మందులు ఇచ్చి రక్తం ఎక్కించి అవసరమైతే తిరిగి శస్త్రచికిత్స చేయవలసి ఉంటుంది. కొన్నిసార్లు గర్భసంచి తొలగించాల్సి వస్తుంది. ఇంకొన్నిసార్లు ప్రాణం పోయే పరిస్థితి కూడా సంభవిస్తుంది.

ఇన్ఫెర్టిలిటీకి చికిత్స తీసుకుంటున్న వారిలో ఈ వ్యాధి ఉందని సందేహం కలిగినప్పుడు గర్భాశయం అంతర పొర నుంచి కొంత భాగాన్ని సేకరించి పాథాలజీ పరీక్షకి, టీబీ నిర్ధారణకి పంపిస్తారు. లేదా యోని నుంచి వచ్చే స్రావాలను ఒక స్టెరైల్ కాటన్ మీద సేకరించి సూక్ష్మ జీవ నిర్ధారణ పరీక్షలకి పంపిస్తారు. ఈ పరీక్షల్లో వచ్చే ఫలితాలను అనుసరించి చికిత్స చేస్తారు.

అయితే ఈ ఇన్ఫెక్షన్లు చాలా మొండివి. చికిత్సకు అంత సాధారణంగా లొంగవు. యాంటీ బయటిక్స్‌ని ఎక్కువ రోజులు ఇవ్వడం కానీ లేదా కాంబినేషన్లను మార్చి మార్చి ఇవ్వటం ద్వారా కానీ దీనికి చికిత్స చేయొచ్చు.

అల్లోపతి మందులతోపాటు ఆయుర్వేదంతో కూడా యాంటీబయటిక్ చికిత్స చేయొచ్చు. పుష్యానుగచూర్ణం, త్రిఫల గుగ్గులు, కానుగ చెక్క బెరడుతో కషాయం, నింబతిక్తక కషాయం లాంటి మందులను ఉపయోగించి మొండి ఇన్ఫెక్షన్లను కూడా నియంత్రించొచ్చు.

రిపోర్టు

# కనిపించకుండా పోయిన జెఎన్‌యు విద్యార్థి నజీబ్ అహ్మద్

-కె. సమత

నజీబ్ జెఎన్‌యులో ఎంఎస్‌సి బయోటెక్నాలజి చదువుతున్న 27ఏళ్ళ విద్యార్థి. అక్టోబర్15 నుండి జెఎన్‌యు నుండి మిస్సింగ్. అతని మిస్సింగ్‌కి కారణం ఎవరు? అసలు ఏమి జరిగింది? నజీబ్ ఉంటున్న మాహిమాండవి హాస్టల్ వార్డెన్, జెఎన్‌యు యాజమాన్యం అందించిన రిపోర్టు ప్రకారం అక్టోబరు 14 రాత్రి 11గంటలకు హాస్టల్ కమిటీ సభ్యులు ఎలక్షన్ క్యాంపెయిన్ కోసం అదే హాస్టల్‌లో ఉంటున్న విక్రాంత్, అంకిత్, సునీల్ ప్రతాప్ నజీబ్ రూమ్ తలుపు కొట్టారు. ఎటువంటి కారణం లేకుండా నజీబ్ విక్రాంత్‌ను చెంపదెబ్బ కొట్టాడు. దాంతో క్యాంపెయిన్‌కు వెళ్ళిన ముగ్గురు విద్యార్థులకు నజీబ్‌కు మధ్య వివాదం చోటు చేసుకుంది. మరుసటి రోజు నుండి నజీబ్ హాస్టల్ నుండి మిస్సింగ్.

యూనివర్శిటీలు, హాస్టల్స్ లో విద్యార్థుల మధ్య వివాదాలు, ఘర్షణలు సాధారణం. కానీ అటువంటి ఘర్షణ తర్వాత ఒక విద్యార్థి కనిపించకుండా పోవడం అనేది చాలా అసాధారణం. నజీబ్ కేసు ఎన్నో మలుపులు తిరిగింది. ఈ ఘటన పై పలు కోణాల్లో చర్చలు జరిగాయి. నజీబ్ ముస్లిమ్ కావడం, వాదనకు దిగిన మిగతా ముగ్గురు విద్యార్థులు ఎబివిపి కార్యకర్తలు కావడం ఈ కేసులో కీలకమైన కమ్యూనల్ ఏంగిల్. ఈ ఘటన చుట్టూ జరుగుతున్న మత రాజకీయాలు నజీబ్ మిస్సింగ్ కేసును ఎన్నో మలుపులు తిప్పుతున్నాయి. అనేక అనుమానాలు తలెత్తుతున్నాయి.

జెఎన్‌యు యాజమాన్యం, విసి నజీబ్ మిస్సింగ్ విషయంలో నిర్లక్ష్యం వహించారనడమేకాక నజీబ్‌ను హాస్టల్ నుండి తీసేస్తున్నట్లు నోటీసులు జారీ చేశారు. ఆ వివాదంలో మిగతా ముగ్గురు గురించి అసలు చర్చ లేకపోవడం, వారిపై ఎటువంటి యాక్షన్ తీసుకోకపోవడం చూస్తుంటే ఈ కేసులో అడ్మినిస్ట్రేషన్ ఏకపక్ష వైఖరి స్పష్టంగా కనిపిస్తుంది. జెఎన్‌యులో విద్యార్థి సంఘాలు, దేశవ్యాప్తంగా అనేక విద్యార్థి సంఘాలు ఏకమై నజీబ్ తల్లికి అండగా నిలిచి నజీబ్‌ను తిరిగి జెఎన్‌యుకి తీసుకువచ్చేందుకు పోరాటం సాగిస్తున్నారు.

ఈ పోరాటానికి లెఫ్ట్, కాంగ్రెస్, ఆప్ మరియు అనేక రాజకీయ పార్టీలు మద్దతు తెలిపాయి. నజీబ్ మిస్సింగ్ కేసు గురించి కేంద్ర ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోకపోవడం, అసలు పట్టనట్లు వ్యవహరించడం ఒక ఎత్తు ఐతే కేంద్ర ప్రభుత్వం అధీనంలో ఉంచుకున్న ఢిల్లీ పోలీసు ఈ కేసులో తమ కనీస బాధ్యతతో వ్యవహరించకపోవడం మరొకటి. పైగా విద్యార్థులతో ఇండియా గేట్ వద్ద శాంతియుతంగా నజీబ్ కోసం పోరాడుతున్న తల్లి ఫాతిమా పై పోలీసులు చెయ్యి చేసుకోవడం, తమ కస్టడీలోకి తీసుకోవడం నిజంగా బాధాకరమైన విషయం.

నజీబ్ తల్లి, స్నేహితులు హాస్టల్‌లో వివాదం జరిగినపుడు ప్రత్యక్షంగా చూసిన విద్యార్థులు చెప్పిన కథనం ప్రకారం నజీబ్ విక్రాంత్‌ల మధ్య ఘర్షణ చోటు చేసుకుంది. వాదనలో నజీబ్ విక్రాంత్‌ను చెంప దెబ్బ కొట్టాడు. విక్రాంత్ తన తోటి ఎబివిపి కార్యకర్తలు అయిన అంకిత్, సునీల్‌తో రక్తం కారేలా కొట్టారని నజీబ్ స్నేహితులు,




ప్రత్యక్షంగా చూసిన ఇతర విద్యార్థులు చెప్పారు. హాస్టల్ వార్డెన్ వారిని అదుపు చేసి గాయపడ్డ నజీబ్‌ను యూనివర్శిటీ అబులెన్స్‌లో సఫ్దర్‌జంగ్ హాస్పటల్‌కు తరలించారు. ఈ ఘటన జరిగిన మరుసటి రోజు నజీబ్ తన తల్లికి ఫోన్ చేసిన హాస్టల్‌లో గొడవ అయిది నాకు బాగా దెబ్బలు తగిలాయి, హాస్పటల్‌లో ఉన్నానని చెప్పాడు. తను బయల్దేరి వస్తున్నానని నజీబ్ తల్లి ఫాతిమా చెప్పింది.

అక్టోబర్ 16 తన కొడుకు కోసం జెఎన్‌యు చేరుకున్న ఫాతిమాకు నజీబ్ ఆచూకీ లేదు. నజీబ్ కుటుంబం జెఎన్‌యు అడ్మినిస్ట్రేషన్‌కు, పోలీసు స్టేషన్‌లోను నజీబ్ మిస్సింగ్ కేసు ఫైల్ చేశారు. ఆ రోజు నుండి నజీబ్ తల్లి తన కొడుకు కోసం ఎదురు చూస్తూనే ఉంది. తన కొడుకు ఏమైపోయాడనే బాధతో, ఎక్కడున్నాడో చెప్పండి అని ప్రశ్నిస్తూనే ఉంది. ఫాతిమాకు అండగా నిలిచిన ఎంతోమంది రాజకీయ నాయకులు, విద్యార్థులు ఆ తల్లి ఆవేదన చూసి మాట రాక మూగబోయారు. నజీబ్ ఆచూకీ తెలుసుకోవడానికి ఈరోజుకీ పోరాటం జరుగుతూనే ఉంది. తన కొడుకు రాక కోసం తల్లి ఎదురు చూస్తూనే ఉంది. ✱✱

# హిందూ- ముస్లిం మహిళల విజయకేతనాలు

- వి. సత్యవతి

ఆడవాళ్లను తప్పుడు తూకపురాళ్లతో తూచే పురుషాధిక్యత అన్ని మతాల్లోనూ ఉన్నది. అసోం రాష్ట్రంలో అజంపీర్‌దర్గా ఉన్నది. 'అజంపీర్' సూఫీ సిద్ధాంత తత్వవేత్త. ఆయన కవి, రచయితకూడా. తన రచనల ద్వారా, పాటలద్వారా ఇస్లాంలోని సూఫీ మతవ్యాప్తికి కృషిచేశారు. ప్రజలలో మంచి పేరుపొందారు. ఆయన మరణానంతరం అతని పేరుమీద అజాన్‌పూర్ దర్గాను నిర్మించారు.




అసోం రాష్ట్రానికి 1911లో పట్నాయక్ గవర్నర్‌గా నియమింపబడ్డారు. గవర్నర్ సతీమణి జయంతి పట్నాయక్ చైతన్య భావాలుగల మహిళ. 18 నవంబర్ 1911లో ఆ దంపతులు ముస్లింలతో కలిసి దర్గా బయట ప్రార్థనలో పాల్గొన్నారు. వర్తమానకాలంలో ముస్లిం మహిళలు అనేక రంగాలలో పురోగమిస్తున్నారు. అలాంటి వారిపై దర్గా ప్రవేశాన్ని నిషేదించటం సమంజసం కాదని ముస్లిం మత పెద్దలను చర్చలద్వారా ఒప్పించారు. ముస్లిం మతపెద్దలు ముస్లిం మహిళల దర్గా ప్రవేశానికి సమ్మతించారు. నవంబర్ 18 న 20మంది ముస్లిం మహిళలు దర్గాలోనికి ప్రవేశించి ప్రార్థనలు చేసి చరిత్ర సృష్టించారు. వారితోపాటు జయంతి పట్నాయక్ కూడా దర్గాలోకి ప్రవేశించి ముస్లిం మహిళలతో కలిసి ప్రార్థనలో పాల్గొన్నారు. ఇలాంటివి మతసామరస్యానికి తోడ్పడుతాయి.

ముంబయిలో ప్రసిద్ధి చెందిన హాజీఅలీ దర్గా ఉంది. 2012లో దర్గా ట్రస్టు ముస్లిం మహిళల ప్రవేశాన్ని నిషేదించింది. అంతకు పూర్వం నిషేదంలేదు. 'భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్' అనే స్వచ్ఛంద సంస్థకు చెందిన జకియాసోమన్, నూర్జహాన్‌లు స్పందించారు. 'భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్' అనేసంస్థ రాజస్థాన్‌లో ముస్లిం మహిళా ఖాజీలను తయారు చేయటానికి పూనుకుని వారికి ట్రైనింగ్ ఇస్తున్నది. ఆ మహిళలిద్దరూ నిషేధంపై ప్రజాహిత వ్యాజ్యం పేరున ముంబయి హైకోర్టులో పిల్ దాఖలు చేశారు. జస్టిస్ రేవతి, వి.ఎం.కానడే ధర్మాసనం విచారణ చేపట్టింది. విచారణ సమయంలో పురుష ముస్లిం ప్రబోధకుని సమాధివద్దకు మహిళలు వెళ్లటం ఇస్లాం మత సూత్రాల ప్రకారం పాపమని ట్రస్టు వాదించింది. అంతేగాక లైంగిక వేధింపులనుండి ముస్లిం మహిళల భద్రతకు, రక్షణకు నిషేదం అవసరమని వాదించింది. పిటీషనర్ల తరపు న్యాయవాది ఇస్లాంలో లింగవివక్షతకు దారే లేదని ఖురాన్‌నుంచి కొన్ని ప్రబోధాలను సవివరంగా వివరించారు. ఇరుపక్షాల వాదనలు విన్న ధర్మాసనం సంచలనాత్మకమైన తీర్పునిచ్చింది. 2012 వరకు మహిళలపై నిషేదం లేదని, ఇప్పుడు నిషేదం విధించడం అంగీకారయోగ్యము కాదని ధర్మాసనం స్పష్టం చేసింది. మతాచారాల పేరుతో రాజ్యాంగంలోని ఆర్టికల్ 26 పేర్కొంటున్న మతాచారణ హక్కును ట్రస్టు అణచివేయజాలదని తేల్చిచెప్పింది. పురుషులతోపాటు సమానంగా మహిళలకు పవిత్రస్థానం సమాధివరకు వెళ్లేందుకు అనుమతిస్తూ 28 ఆగస్టు 2016న తీర్పు

చెప్పింది. సుప్రీంకోర్టుకు వెళ్లేందుకు ట్రస్టు అభ్యర్ధనను అంగీకరిస్తూ ఆదేశాల అమలును ఆరువారాలు నిలిపివేస్తున్నట్లు ప్రకటించింది. ముస్లిం మహిళల భద్రతకు, రక్షణకు చర్యలు తీసుకోవాలని ట్రస్టును, రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. 'భారతీయ ముస్లిం మహిళా ఆందోళన్' కు చెందిన మహిళా సభ్యులు హర్షం వ్యక్తం చేశారు. ఇతర పురుషులకు జన్మనిచ్చినట్లే సూఫీ మతగురువులకు కూడ జన్మనిచ్చింది మహిళలమేకదా! వారి సమాధి వద్దకు వెళ్ళటానికి మాపై అంక్షలెందుకు? నిషేదాలెందుకు? అని బీబీఖాతూన్ ప్రశ్నించింది.

కేరళలో వెయ్యి సంవత్సరాలనాటి మసీదు ఉంది. చాలా పురాతనమైనది. ఆ మసీదును తళాతంగళిలో చెక్కతో నిర్మించారు. అద్భుతమైన కళానైపుణ్యంగల శిల్పాలతో నిర్మితమైనది. అత్యంత పురాతనమైన శిల్పసౌందర్యంతో పవిత్ర మసీదును చూడటానికి ప్రవేశం కల్పించాలని ముస్లిం మహిళలు ఎంతో కాలంనుంచి అడుగుచున్నారు. రోజు రోజుకు వారి వత్తిడి ఎక్కువవుతున్నందువలన చివరకు మసీదు కమిటి మహిళల ప్రవేశానికి అనుమతించింది. అదికూడ షరతులతో కూడుకున్న అనుమతి. గత సంవత్సరంలో ఎప్రిల్ 24నుంచి మే8వ తేదివరకు మహిళల ప్రవేశానికి అనుమతించింది. ముస్లిం సోదరీమణుల విజయానికిది తొలి అడుగు. ఎప్పటికైనా వారు ఎల్లప్పుడు ప్రవేశహక్కును పోరాటాలద్వారా పొందగల్గుతారని ఆశిద్దాం.

కేరళలో ఘోటక బ్రహ్మచారి అయ్యప్పస్వామి దేవాలయం శబరిమలై కొండపైనుంది. ఆ దేవాలయంలోనికి రజస్వల అయిననాటి నుంచి నెలసరి ఆగిపోయేంతవరకు మహిళలకు ప్రవేశం నిషిద్ధం. నెలసరి (ముట్టు) ప్రకృతి సిద్ధమైనది. ఋతుక్రమంవల్లనే సృష్టికార్యం జరుగుతుంది. అదిలేకపోతే మానవజన్మే ఉండదు. ఒక స్వచ్ఛంద సంస్థ దేవాలయ ట్రస్టు బోర్డు సభ్యులపై ప్రజాహిత వ్యాజ్యం పేరుతో పిల్ దాఖలు చేసింది. దీర్ఘకాలిక పోరాటం తర్వాత, సుప్రీంకోర్టు తీర్పుతో దేవాలయ ట్రస్టుబోర్డు సభ్యులు నిషేదం తొలగించి మహిళల ప్రవేశానికి 2016 అంగీకరించింది. అదే విధంగా మహారాష్ట్రలో శనిదేవత ఆలయం ఉంది. ఆ ఆలయంలో దేవత వెలసినప్పటినుంచి మహిళలకు ప్రవేశం నిషిద్ధం. ఆలయ ప్రవేశానికి ఉన్న నిషేదంపై తృప్తిదేశాయ్ సుప్రీం తలుపుతట్టింది. ఆమె పోరాటం ఫలించింది. సుప్రీం ఆమెకు అనుకూలంగా తీర్పు చెప్పింది. పురుషులతోపాటు స్త్రీలుకూడా గర్భగుడి దాకా వెళ్లవచ్చని తీర్పులో స్పష్టం చేసింది.



# మహిళా హక్కుల సాధనలో అంబేద్కర్



ఒక గొప్ప పండితులు, ప్రసిద్ధ విద్యావేత్త, స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాత, సామాజిక తిరుగుబాటు యోధుడు, సామాజిక రుగ్మత అయిన కులపీడనపై అలుపన్నది లేకుండా, రాజీ పడకుండా పోరాటం చేసిన వ్యక్తి డా॥ బాబా సాహెబ్ అంబేద్కర్ ఆయన మరణించి 60 సంవత్సరాలు అయ్యింది. మహిళలు భారత సమాజంలో ఎంత అణచివేతకు గురి అవుతున్నారో అన్నది ఎలుగెత్తి పార్లమెంటులో చాటిన వ్యక్తి వారి హక్కులు అంగీకరించిన ప్రభుత్వంలో నాయకుడుగా కొనసాగను అని తృణ ప్రాయంగా అత్యున్నత పదవిని త్యాగం చేసిన వ్యక్తి. ఆయన కోరుకున్న కుల అసమానతలు ఈ రోజుకూ తొలగలేదు. ఆడవాళ్ళని ఇప్పటికీ 2వ తరగతి పౌరులుగానే చూస్తున్నారు. ప్రభుత్వాలు మారినా, నాయకులు మారినా దళిత మహిళలు, మహిళల పట్ల చిన్న చూపును తగ్గించలేక పోయింది. ఎంతో కష్టంతో సాధించుకున్న మహిళా చట్టాలు లోపాల సాకుతో అరకొరగా కొనసాగు తున్నాయి. ఇంత అసమానత మహిళల పట్ల కొనసాగుతున్న ఆధునిక మహిళ ఈ పంజరం నుంచి బయటపడి కొంత వరకు స్వేచ్ఛను సంపాదించుకోవడం కీలక పదవుల్లో కొంత వరకు కొనసాగడం అభినందనీయం 130కోట్ల దగ్గరకు వస్తున్న జనాభా ఒక మహిళా గాయలున్నప్పటికి భారతదేశం రజిత పథకం సాధించి పి.వి సింధు, కాంస్య పథకం సాధించిన సాక్షిమాలిక్, పోరాటంలో ముందు నిలబడిన దీపాకర్మాకర్‌ని ఈ సందర్భంగా అభినందించాలి. అలాగే డా॥ బి. ఆర్. అంబేద్కర్ స్పూర్తితో మహిళల హక్కులు సాధనకై ప్రతిన బూనటమే ఆయనకు మనం అందించే నిజమైన నివాళి.

కథ

# భడక్తా చిరాగ్

- స్కైబాబ

కరెంట్ పోయింది. అర్ధరాతిరి అయిందేమో... నిద్రపట్టక పైకప్పుకెల్లి చూస్తున్న జరీనాలో కరెంటు పోయినాగూడ ఆలోచనలు తెగుతలెవ్. ఫ్యాన్ స్పీడ్ తగ్గి మెల్లమెల్లంగా సప్పుడు చేస్కుంట ఆగిపోయింది. ఏం కన్పడ్తలేని అంత చీకట్ల గూడా జరీనా కండ్లు అట్టనె నిశ్చలంగా తెర్చుకునే ఉన్నయ్... అల వాటైపోయ్న చీకటి... ఏడాదిన్నర గడిచిపోయింది, తన బతుకుల అచ్చం అలాంటి చీకటే పరుచుకొని.. ఫ్యాన్ ఆగిపొయ్యే సరికి ఉడకపొయ్యడం షురూ ఐంది. చిన్న పిల్ల కదిలింది నిద్దట్ల. పిల్లదిక్కుమల్లి ఈపుమీద జొకొట్టుకుంట మళ్ల ఆలోచనల్లపడింది జరీనా.

సరిగ్గ ఆ పిల్ల పుట్టిన రెండో నెలల్నె సౌదీ పోతాన్కి వీజా దొర్కింది గౌస్‌కు.

తను ఆరని ఒంటితోని ఉండి తలకు గుడ్డ కట్టుకొని ఒళ్లో పిల్లకు పాలిచ్చు కుంట కూసూనున్నది. కాల్లు కడుక్కొని లోపలి కొచ్చిండు గౌస్.

తన పక్కకొచ్చి ముద్దొస్తున్న పసిపిల్ల దూదిపింజల్లాంటి బుగ్గల్ని చేత్తో సుతారంగ నిమిరి ముద్దుపెట్టుకుంట తన పక్కన కూసున్నడు. ఆ చర్యకు తృప్తితో నిండిన చిరునవ్వుతోని గౌస్ దిక్కు చూస్తున్నది తను.

"సౌదీ ఎల్లేరోజు ఖరారైంది జరీన్. వచ్చే పదో తారీఖునాడే బయలుదేరాలె" అన్నాడు.

ముఖంలో చిర్నవ్వు మాయమై



భయంగ చూసింది తను.

"ఇంత జల్దీనా?" అన్నది ఆశ్చర్య పోయ్యి... "ఈ ముగ్గురు పిల్లల్తోని ఎట్ల ఏగాలె... నీళ్ళు తెచ్చుడు, బైటి పనులన్నీ ఎట్ల?" అన్నది ఎగాదిగ. కానీ పోవొద్దని మాత్రం అన్లె. పాస్‌పోర్ట్ దగ్గర్నించి విజా దాన్క గౌస్ ఎన్నెన్ని కష్టాలు పడ్డదో తెలిసిందెనాయె.

పెండ్లి కానప్పుడో పాలిపోతనంటె గౌస్ తల్లి బీజాన్‌బీ పుప్పమ్మ అడ్డు పడిందంట. పుప్పమ్మ ఏడ్సుకుంట 'ఎన్ని కష్టాలైన పడదంగని ఏడేడు సముద్రాలు దాటి ఎందుకురా పొయ్యేది' అనుకుంట సస్తె ఒప్పుకోలేదంట.

పెండ్లయినంక ఓ పాలి మళ్ల కోశిష్‌లు షురూ చేసిండు. ఆసారి తను ఏడ్చి గగ్గోలు పెట్టి మాన్పించింది. కాని చెల్లెండ్ల పెళ్ళిళ్ళు చేసినంక, తమ్ముడు పెళ్ళికాంగనె ఏరుబడ్డంతోని శానా అప్పులు గౌస్ నెత్తిన పడ్డయ్. అప్పులట్ల ఉండిపోయి తన పిల్లల్తోపాటు పెరగబట్టినయ్. తిన్న అన్నం ఒంటికి పట్టకుంటయ్యింది. ఇగ దాంతోటి తను పుట్టిపెరిగిన గడ్డను... తనను చూడకుండ ఉండ లేని పిల్లలు. నాల్గు రోజుల్‌గూడ దూరం ఉండ లేని తనను... తన అమ్మాజీన్‌ని తన దోస్తుల్ని ఎడబాయ దానికే నిశ్చయిం చుకున్నడు. ఆ నిశ్చయానికి వస్తాన్కి ఎంత గోస తీసిండో...

కాని తప్పలేదు. అప్పులోళ్ళు వచ్చి ఇంటిమీద పడుతుంటే ఎన్నాళ్ళని దాటె య్యడం. ఎన్నని అబద్ధా లాడ్డం? తమ్ముడు కొద్దిగ నెమ్మదస్తులైన అప్పులోళ్లని పంచుకొని కొంచెం ఒడ్డునపడ్డడు. కారు డ్రైవరీ చేసుకుంట ఎట్లనోగట్ల నెట్టు కొస్తున్నడు. గౌసేమో ఆదనంగ కొన్ని అప్పులు మీదేసుకొని ఇల్లు తన వాటాకింద ఉంచుకున్నడు. దాంతోని మరిన్ని కష్టాలు షురూ ఐనయ్. ఓ ఎలక్ట్రానిక్స్ షాపుల రేడియో మెకానిక్‌గ చేసే పనికి వచ్చే జీతం చాలక పరేశాన్లు పెరగబట్టినయ్.

ఒక్కోరోజు ఇంట్లకు బియ్యంలేక

యమ ఇబ్బంది అయ్యేది. పైగా అప్పులో ళ్ళొచ్చి గల్లీ గల్లీ అంతా ఇనబడేటట్లు అరుస్తుంటె గుండెల్ల గుబులు గుబులుగ ఉండేది.

ఓ పాలి పెద్ద గడ్‌బడే ఐంది. ఆ ఒచ్చిన అప్పులోడరుస్తుంటె తట్టుకోలేక 'ఇప్పుడు లెవ్వు. ఏం జెయ్యమంటవ్?' అన్నడు గౌస్. అంతే ఆడొచ్చి గల్లా పట్టిండు. ఇద్దరు కిందమీదైన్రు. గల్లీ లోళ్ళంత ఒచ్చి ఇడిపిచ్చిన్రు. 'నేను ఇవ్వనే ఇవ్వను' అని గౌస్ 'ఎట్ల ఇయ్యవో చూసుకుంట' అని ఆడు.. రెండోరోజు తెల్లారి కొందరు పెద్దమనుషుల్తోటి ఒచ్చి పంచాయితీ పెట్టిచ్చిండు ఆడు. ఆఖరికి ఇప్పుడు తన పరిస్థితి బాగలేదని, కొంత టైం కావాల్నని అడిగిండు గౌస్. ఏడాది లోపల ఇయ్యాల్నని ఖరారైంది. ఇయ్యక పోతే మాత్రం ఇల్లు జప్తు చేసేటట్లు తశ్వ జేసిన్రు. దాంతోని మరింత భయం పెట్టుకొంది. బిర్రు చేసిన ఆ ఒక్కడే కాక అట్లాంటి అప్పులోళ్ళు ఇంకో నలుగు రున్నరు. ఇగ తప్పనినరై సౌదీ పయనమైండు గౌస్.

రెండోడు నిద్దట్లనె 'పానీ!పానీ! అంటుండడంతోని చీకటిలోకంలో కొచ్చింది జరీనా. లేచి అగ్గిపెట్టె ఎతికింది. దొర్కలే. తడుముకుంట బిందెల్నించి నీళ్ళు ముంచి రెండోన్ని లేపి తాపింది. ఆడు కండ్లు మూసు కొనే ఉన్నట్లుంది. గటగట తాగి గట్టిగ ఊపిరి వదిలి 'సోజాతమ్! సోజాతమ్!' అంటున్నడు. నీళ్ళగ్లాసు పక్కనబెట్టి అన్ని పక్కమీదికి ఒరిపింది. ఆడు ఎమ్మట్నె నిద్దర్లకు

గౌస్ ఒచ్చిండు. కానీ అతనిల ఏందో తేడా... మాటల్ల, చేతల్ల. చూపుల్ల ఆ తేడా కొట్టొచ్చినట్లు కన్పిస్తుంటె పరేశానయ్యింది తను. పైసలు బాగనె తెచ్చినట్లుంది ఏం చెప్పలె. ఒచ్చిన రెండ్రోజుల్లనే అప్పులన్నీ తీర్చేసిండు. దోస్తుల్లోని జల్సాలు చేసిండు. చూస్తాన్కి వచ్చిపోయే చుట్టాల్ని మాత్రం అంతంత మాత్రంగనె పల్కరించిండు. ఎక్కువ టైం తనతోపాటు సౌదీ పొయ్యొచ్చిన ఖాసిమ్ వాళ్ళింటికెళ్ళి వాళ్ళవాళ్ళతోనే గడపబట్టిండు.

ఎళ్ళిపోయిండు. అని తల నిమురుకుంట కూర్చున్నది...

ఆడంటె ఎంత ఇష్టముండేది తండ్రికి. సౌదీ ఎళ్ళేటప్పుడు ఎంతగనం ఇదై పోయిండో... అన్ని ఒదల్లేక ఒదల్లేక ఒదిలిపొయ్యిండు. ఎళ్ళిపోయ్న రెండో రోజు నుంచి ఆతనికి జొరం. తండ్రి కనబడకపొయ్యేసరికి గుండె బలిగిండు ఎంతకూ తగ్గకపొయ్యేసరికి తన గుండెల్ల రాయి పడ్డది. నిద్దర్ల ఒకటే 'అబ్బా.. అబ్బా!' అని కలవరింతలు.. ఎన్నాళ్ళకో గాని సుతరాయించుకోలె.

ఆళ్ళ నానిమాను తీనుకొచ్చి తోడుంచి పొయిండు గౌస్. పిల్లలు ముగ్గురు నాని మాకు బాగా దగ్గరై తండ్రిలోటుని తీర్చుకున్నరు.

మొదటిపాలి ఏడాదికి ఒచ్చిండు గౌస్. ఆ ఏడాదిలాడ ఎన్ని కష్టాలు పడ్డడోగని పైసలు మాత్రం ఎక్కువగా వంపకపొయ్యేది. ఆడికాడికి సరిపొయ్యేటట్లు పంపేది. అప్పులోళ్ళ కొందర్కి మిత్తీలు కట్టుకుంట, రెన్నెళ్ళకో మూన్నెళ్లకో ఒకరి అప్పు తీర్చడం చేసిన్రు.

పుప్పమ్మ, తను ఒకరికి తోడు ఒకరై గడిపిన్రు ఆ ఏడాదంతా. గౌస్ వచ్చే రోజులు దగ్గర పడుతుంటే రోజులు ఇంక జల్ది జల్ది గడిచిపోతె బాగుండునన్నట్లు ఎదురు చూసేది తను. ఊర్కె బీజాన్‌బీ పుప్పమ్మతోని గౌస్ ముచ్చట్లె మాట్లాడ్తుండేది. ఇగ తెల్లారి వస్తడనంగ రాత్రంత నిద్రపోకుంట అన్నీ సర్దీచేసీ గడియొక యుగంగా ఎదురు చూసింది.

గౌస్ ఒచ్చిండు. కానీ అతనిల ఏందో తేడా... మాటల్ల, చేతల్ల. చూపుల్ల ఆ తేడా కొట్టొచ్చినట్లు కన్పిస్తుంటె పరేశానయ్యింది తను. పైసలు బాగనె తెచ్చినట్లుంది ఏం చెప్పలె. ఒచ్చిన రెండ్రోజుల్లనే అప్పులన్నీ తీర్చేసిండు. దోస్తుల్లోని జల్సాలు చేసిండు. చూస్తాన్కి వచ్చిపోయే చుట్టాల్ని మాత్రం అంతంత మాత్రంగనె పల్కరించిండు. ఎక్కువ టైం తనతోపాటు సౌదీ పొయ్యొచ్చిన ఖాసిమ్ వాళ్ళింటికెళ్ళి వాళ్ళవాళ్ళతోనే గడపబట్టిండు. ఇవన్నీ గమనిస్తనె ఉన్నది తను. మన్సుల ఏమూలో అతని ప్రవర్తన ముల్లైగుచ్చుకుంటనే ఉన్నది.

"క్యావ్‌రే! ఇంట్ల అస్సలు ఉంటనే లేవ్వు. యాణ్ణో తిరిగొస్తావేంద్రా" అని

పుప్పమ్మ మొత్తుకుంటనె ఉన్నది... ఒకరోజు కొంచెం తాగొచ్చిండు... పక్కమీద ఏదో అసంతృప్తి... అస హనం..! ఒచ్చినప్ప ట్నుంచి ఆ మార్పుని గమనిస్తనె ఉన్నది తను". ఇంక ఓపిక నశించి 'నువ్వు శానా మారిపోయ్‌నవ్' అన్నది. దాంతో మాటా మాటా పెరిగింది. ఎదురు మాట్లాడితె చంపేస్త నన్నడు ఊగిపోతు... నీ అందానికి నువ్వింక జవాబులిచ్చుడు కూడానా. నేనెట్ల చేస్తె అట్ల పడుండాలన్నడు. బిత్తరపోయింది తను. ఉండబట్లేక 'సౌదీ పోకముందు నా ముఖంల 'నూర్' ఉంటుందని అనేవాడివే... నాలుగు పైసలు చేతిల పడంగనె నేనందంగ లేనట్లు కన్పిస్తున్ననా? అంటు కొట్లాడింది. ఇద్దరి అరుపులకు పిల్లలు లేషి ఏడుస్తుండేసరికి కొంచెం తగ్గి మరి కొంచెం సేపట్కి నిద్దర్లకెళ్ళిపోయిండు. తనకు మాత్రం నిద్రపట్టలె...!

ఇంకొక వారం రోజులకు జరిగిందా సంఘటన...! ఆళ్ళ చిన్నమ్మ కొడుకు డిగ్రీ చేస్తున్నడు. అయాల మద్యానం ఒచ్చిండు. పుప్పమ్మ ఏందో పనిల ఉన్నట్లుంది. ముందల ఆ పిలగాడు ఎత్తుకుంటనంటె సంకలున్న పిల్లని ఆ పిలగాన్కి ఇచ్చుకుంట అతనేదో అంటే నవ్వుతున్నది తను. ఆ సమయంల బైటినుంచి గనుమలకొచ్చిన గౌస్‌కు ఆ పిలగాడు తన దిక్కుమల్లి ఉండి తనను కౌగిలించు కొని పిల్లను తీసుకుంట దూరం జరుగుతున్నట్లె కనిపించిందంట.

అంతే...ఇల్లు యుద్ధరంగమై పోయింది. తన ఒళ్ళు హూనమై పొయ్యింది. పిల్లలకు, పుప్పమ్మకు ఏం జరుగుతున్నదో ఏం సమజ్‌గాలె. పుప్పమ్మ ఎంత ఆగబట్టినా ఆగకుంట కొట్టరాని దెబ్బలు కొట్టిండు. అతనెందుకు

**నాల్గునెల్లల్ల బీజాన్‌బీ పుప్పమ్మ చచ్చిపోయింది! కేవలం కోడలు బతుకు అన్యాయమైపోయిందని, పిల్లలు దిక్కులేనోళ్ళైపోయిన్రనే దిగులే ఆమెను మింగేసింది. తను చచ్చిపోతే గౌస్‌కి మాత్రం తెలపొద్దని పుప్పమ్మ ఎన్నోమార్లు చెప్పింది. చిన్న కొడుకొచ్చి తన దగ్గర్కి తీస్కపోతనన్నా పోలె...**

కొడుతున్నడో మొదట తనకు సమజ్‌కాలె. అతని తిట్లు అర్థం చెప్పేసరికి అవాక్కయి పోయింది. ఇక అతను కొడ్తుంటే ఆచేతనమైపోయి ఎటుకొడ్తే అటు వడిపోయింది. ఆఖర సోయి తప్పిపోయింది.

ఆ రోజునుంచి ఇంటికి రావడం బంద్ చేసిండు గౌస్. పుప్పమ్మ ఎతుక్కుంట ఖాసిమ్ వాళ్ళింటికెళ్ళి కొడుకుని ఎంతగనమో బతిలాడిందంట. "జరీనా అట్లాంటిది కాదురా. ఎందుకురా... ఆపిల్లమీద అంత పెద్ద నేరం మోపినవ్. నన్ను ఇంట్లనే ఉంచి పోతివిగదా. నేను చూస్తనె ఉన్నగదా... ఆపిలగాడు ఎప్పుడో ఒకసారి రావడం నిజమే. నేనే రమ్మన్నది. ఇద్దరం ఆడోళ్ళమే ఐతిమి. బైటిపన్లు జర చేసిపెట్టమంటె కదన్లేక ఒచ్చేదిరా. ఆడు శానా మంచోడ్రా, అట్లాంటోడు కాదు. ఎందుకుర నువ్విట్ల జేస్తున్నవ్? నా మాట ఇన్రా, పెద్దదాన్ని, నీ తల్లిని నేన్జెప్పేది ఇన్రా. అరె గౌస్, ఇన్రా...' అని ఎంత జెప్పినా ఇన్లేదంట. దాంతోని ఓపిక నశించి ఎట్లబడ్తె అట్ల తిట్టి వచ్చేసిందంట బీజాన్‌బీ పుప్పమ్మ.

తను పొగిలి పొగిలి ఏడ్సుకుంట "నన్నింత కొట్టినా, ఏం జేసినా పర్వాలెకుంటె గాని నామీద ఇంత అపనింద మోపు తడా...? ఏ తప్పు చేసిన పుప్పమ్మా..." అనుకుంట పుప్పమ్మ కడుపుల తలపెట్టి ఆ పూటంతా ఏడ్చింది తను.

అడిగే వాళ్ళెవరూ లేకుంటయ్యింది గౌస్‌ని. పైగ ఒకరిద్దరు, నెలలు, ఏండ్లు వదిలి పోతే పెళ్ళాలు మాత్రం ఎంతకని ఓపిక పడతరు, ఎవరో ఒకళ్ళని చూసు కోరా?' అని అన్నరని తెలిసి మరింత కుమిలి పోయింది తను. గౌస్ తిరిగి వారంల ఎల్లిపోతడనంగ పిడుగుపాటు వార్త మరొకటి తెల్సింది. ఖాసిమ్ తరపు చుట్టం ఒకామెను గౌస్ నిఖా చేసుకున్నడని! ఆ విషయం ఇనంగనె చక్కరొచ్చి నిలబడ్డకాణ్నె కూలబడి పోయింది తను. గడబడ్‌లైనయ్. కేసు పెట్టమని తనకు కొందరు సలహాలిచ్చిన్రు. పెద్ద మనుషుల్ల పెట్టమన్నరు. తను అవేమీ చెయ్యలె. కాని గౌస్ అంతపని చేస్తడని కలలగూడ అనుకోలె. దాంతో షాక్ తగిలి నట్లయింది. తనల తను కుమిలిపోతూ

నడుస్తున్న శవంలాగయిపోయింది మూగదైపోయింది.

బీజాన్‌బీ పుప్పమ్మ మాత్రం ఆ విషయాన్ని ఎంతకూ జీర్ణం చేసుకోలేక పోయింది. అక్కడికెళ్ళి కన్నతిట్లు తిట్టి ఒచ్చింది. ఇంట్ల దిగులు దిగులుగ ఉండేది. గుండెల్ల గుబులైతుండనేది. పిల్లల్ని పట్టుకొని ఒకటే ఏడ్చేది. తన కోడలు అన్యాయమైపోయిందని ఏడుస్తూ ఏడుస్తూ ఆ దిగుల్తోటి మంచం పట్టింది.

నాల్గునెల్లల్ల బీజాన్‌బీ పుప్పమ్మ చచ్చిపోయింది! కేవలం కోడలు బతుకు అన్యాయమైపోయిందని, పిల్లలు దిక్కులేనోళ్ళైపోయిన్రనే దిగులే ఆమెను మింగేసింది. తను చచ్చిపోతే గౌస్‌కి మాత్రం తెలపొద్దని పుప్పమ్మ ఎన్నోమార్లు చెప్పింది. చిన్నకొడుకొచ్చి తన దగ్గర్కి తీస్కపోతనన్నా పోలె...

ఆ రాత్రి ఏం తినమన్నా తినబుద్ధి ఐతలేదన్నది. తెల్లారి చూస్తె చెంపలమీదంగ కారిన కన్నీళ్లు చారలు కట్టి ఉన్నయ్. దీనంగ చూనన్నా నిశ్చలమైపోయిన కళ్ళు...! ఆ చూపు ఆ రూపం తను జీవితాంతం మరిచిపోలేదు.

మర్ది వాళ్లొచ్చి శవాన్ని వాళ్లింటికి తీస్కెళ్ళిన్రు. తను వెళ్ళింది. బాగ ఏడుస్తూ ఉండిపోయింది. జొహర్ నమాజ్ టైంకు శవాన్ని మజీదుకు తీసుకుపొయిన్రు. పొద్దుగూకాల తను ఇంటికొచ్చేసింది. ఉండమనాల్సిన వాళ్ళెవరూ ఉండమని అన్లేదు. అంతా ముభావంగ ఉంటున్నరు తనతో...

ఇక ఆ తర్వాత మరింత ఒంటరి దైపోయింది తను... ఎన్నోసార్లు ఉరిబెట్టుకొని చచ్చిపోవాలనిపించింది. కాని పిల్లలకోసం ఆ పని చెయ్యలేకపోయింది...

చిన్నపిల్ల ఏడ్వబట్టేసరికి జరీనా ఆలోచన తెగింది. బాగా ఉడకపోస్తున్నది. తన ఒళ్ళంత తడిసిపోయింది. కరెంటు వచ్చేటట్లు లేదు. లేషి మెల్లగ తడుముకుం టపోయి బైటి తలుపు తీసింది. కొంచెం గాలి ఒస్తున్నది. కాని దోమల భయం. బైట గల్లీ అంతా చీకటిగ ఉంది. పిల్ల గట్టిగ ఏడుస్తుండె సరికి పిల్లనెత్తుకొని భుజంమీదేసుకొని జోకొట్టుకుంట గన్వకాడీకి, లోపల్కి రెండడుగులు ఏసుకుంట తిరగబట్టింది.

'అమ్మీ! అమ్మీ! అన్నడు పెద్దోడు.

'క్యావ్‌రే' అన్నది జరీనా.

'దర్ హోతా హై' అన్నడాడు.

'దర్ కైకు? మై హూనా.. సోజా' అన్నదామె.

'చిరాగ్ లగావ్' కాడికి డబ్బినై మిల్తి హై. ఖాముష్ సోజా' అన్నది.

పెద్దోడేం మాట్లాడలేదింక. మళ్ళ ఆలోచన –ఆఖరిసారి ఒచ్చినప్పుడు పెద్దోణ్ణి పిలిపించుకున్నడు గౌస్. జమీల్ అనే ఇంకొక దోస్తుతోని పిలిపించుకొని అతని ఇంట్లనే కూర్చోబెట్టుకొని శానాసేపు మాట్లాడిండంట. అమ్మి మంచిగ చూసుకుంటున్నదా అని అడిగిండంట. చేతిల వెయ్యిరూపాయలు పెట్టి పంపించిండు. రెండో రోజు పెద్దోని స్కూలుకెళ్ళి ఫీజు కడ్తనని అన్నడంట. తన మనసేదో కకావికలమైపోయింది. అతన్ని చూడాలనిపిస్తున్నదో లేదో మరోటో గాని బేచైన్ బేచైన్‌గ ఉండేది. ఒక నెల రోజుల్ల మల్ల అతను ఎల్లిపోయిండని తెలిసింది. కొంచెం ఏవో గొడవలైనట్లు గూడ తెలిసింది. మల్లొక ఆర్నెల్లు గడిచిపో య్యేసరికి మరికొన్ని విషయాలు తెల్సినయ్. వాళ్ళు డబ్బు మనుషులనీ, పైసలు కోసమె గొడవలైనయనీ, పైసలు పంపించమనీ లెటర్లమీద లెటర్లు రాస్తున్నరనీ, వాళ్ళకు గౌస్ ఫోన్లు చెయ్యడం లేదట అనీ , లెటర్లు రాయడం గూడా మానేసిండని తెలిసింది...

ఏడాది తర్వాత నిన్న తనకో లెటర్ ఒచ్చింది గౌస్‌నించి. ఆశ్చర్యమో, సంతో షమో, ఏడుపో ఏమీ అర్థంకాని మనస్థితి తనది. ఆ లెటర్ చూస్తుంటె మాత్రం తన కళ్ళనిండా నీళ్ళు నిండినయ్. అందుల రెండే లైన్లు...'జరీన్! నువ్వు, పిల్లలు గుర్తొస్తున్నరు, ఈ నెల 25 తారీఖు నాడు నేనొస్తున్న... తెల్లారితే 25వ తారీఖు! ఎంత రాత్రయిందో తెలుస్తలేదు. జరీనాకు నిద్రొస్తలేదు.

గుండెలు బరువెక్కుతున్నట్లనిపించ సాగింది. పిల్లను పండుకోబెట్టింది మెల్లగ... దాంతో గయ్యిన ఏడుపు మొదలు పెట్టింది పిల్ల. దిండు కదిలి అగ్గిపెట్టె సప్పుడైంది... దిండు కింద పెట్టుకొని మర్చిపోయ్‌నట్టు గుర్తొచ్చి తడుము కుంట అగ్గిపెట్టె తీస్కొని లేచి అగ్గిపుల్ల గీరి దీపంబుడ్డి ఎలిగిం చింది. గ్యాస్‌నూనె కొంచెమె ఉన్నట్లుంది. ఆ దీపం ఎంత సేపుంటుందో తెలియదు.

**("అధూరె" ముస్లిం కథలు నుండి)**

కేస్ స్టడీ

# నేనంటే ఇష్టంలేని వాళ్ళు నాకు వద్దు

- కె. శారద

ఉదయం 12 గంటలయింది. చేస్తున్న పనిని ఆపి ఐదు నిమిషాలు విశ్రాంతిగా వెనుకకు వాలింది కంప్యూటర్ ఆపరేటర్ సుధ. ఆమె ప్రైవేటు కంపెనీలో డి.టి.పి వర్క్ చేస్తుంది. అమ్మ నుండి ఫోను వచ్చింది. ఆమె చెబుతోంది ఒక మంచి సంబంధం వచ్చింది నీకు. ఆ అబ్బాయి వాళ్ళ అమ్మ నాకు బాగా తెలుసు ఆ అబ్బాయి కూడా నీ లాగే ప్రైవేటు కంపెనీలో పని చేస్తున్నాడు. బాగుంటాడు, బుద్ధి మంతుడు, ఏమీ బాధ్య తలు లేవు, ఒక్కడే అబ్బాయి. నువ్వు సాయంత్రం త్వరగా వచ్చెయి. వాళ్ళు మనింటికి వస్తాము అన్నారు అంది. అలాగేలే అని మళ్ళీ పనిలో పడింది సుధ. సాయంత్రం ఇంటికెళ్ళి తల్లి చెప్పినట్లు తయారయి కూర్చుంది. అక్క కూడ హడావుడి పడుతూ అన్ని ఏర్పాట్లు చేస్తుంది. పాపం! అక్క భర్త తాగుడుకు బానిసై లివర్ చెడిపోయి చనిపోతే ఇద్దరు పిల్లలతో చిన్న ఉద్యోగం చేస్తూ ఇక్కడే ఉంటోంది. నేను పెళ్ళి చేసుకొని వెళ్ళిపోతే అమ్మ అక్క ఇద్దరు పిల్లలతో ఎన్ని అవస్థలు పడతారో అనుకుంది.

వాళ్ళు వచ్చారు. పెళ్ళి చూపులయినాయి. అమ్మాయి మాకు నచ్చింది మిగతా విషయాలు మాట్లాడుదాం అన్నారు. సుధకు కూడా కాదనడానికి ఏమీ లేదు అనిపించింది. నేను అతి మామూలుగా వుంటాను ఇంతకన్నా ఎక్కువ ఏమీ ఆశించకూడదు అనుకుంది. వివాహానికి అంగీకరించింది. వివాహం ఆర్.సి.ఎం చర్చిలో జరిగేలాగా పెళ్ళిలో 80వేల డబ్బు, అబ్బాయికి అరతులం ఉంగరం ఇచ్చేలాగా మాట్లాడుకున్నారు. పెళ్ళి ఖర్చులకు గాను కొద్దిగా స్థలం వుంటే అది అమ్మేసింది అమ్మ ఏ ఆటంకం లేకుండా పెళ్ళి జరిగింది. అక్క అమ్మ వేరే చిన్న ఇంట్లోకి మారారు.

నెల రోజులు చక్కగా జరిగిపోయాయి. అత్తగారు, భర్త ఎంతో ప్రేమగా ఉన్నారు. ఉద్యోగం మానవద్దు అన్నారు. ఎంతో సంతోషంగా అలాగే అంది సుధ. పెళ్ళికి నెల సెలవు పెట్టాను అన్నాడు భర్త. ఎంతో పొంగిపోయింది సుధ.

నెమ్మదిగా సుధ ఆఫీసుకు వస్తోంది. సాయంత్రం ఇంటికి వెళ్ళేటప్పటికి భర్త ఇంట్లోనే వుంటున్నాడు. ఒకరోజు ఆమె ఆఫీసుకు వెళుతూ 'మీకు కూడా లంచ్‌బాక్స్ సర్దనా' అని అడిగింది. పెళ్ళి అయినప్పటి నుంచి అత్తగారు ఆమెకు అన్ని పనులు అప్పగించి విశ్రాంతిగా వుంటోంది. సుధే అన్ని పనులు చూసుకుంటోంది. 'నా సంగతి నాకు తెలుసులే! నీ పని నువ్వు చూసుకో' అని విసురుగా అన్నాడు భర్త. నాకు ఎందుకులే విసుగ్గా వున్నాడేమో అని వెళ్ళిపోయింది సుధ. అలాగే రోజూ జరుగుతోంది. భర్త ఆమెతో ఏమీ పెద్దగా మాట్లాడటం లేదు. అత్తగారు పట్టించుకోరు. భర్త ఏమీ చెప్పడు. చివరికి తెలిసింది ఏమంటే పెళ్ళి చూపులపుడు అత్తగారు చెప్పినవి అన్నీ అబద్ధాలే అని. భర్త ఏ పనీ చేయడు. సంపాదన లేదు. చదువు ఎంతవరకు ఉందో తెలియదు. సుధ

**నాకేం తక్కువ నేనెందుకు వాళ్ళకు నచ్చడం లేదు. నన్ను ఎందుకు ఇంత అవమానానికి గురి చేస్తున్నారు. నేనేమీ వారి వెంట పడలేదే. పెళ్ళి చేసుకోమని అడుగలేదు కదా! వాళ్ళే వెంటబడి ఒప్పించి చేసుకున్నారు. మరి ఇదంతా ఏమిటి? అని ఆలోచించింది. తల్లితో కలసి ఆమె ఐద్వా లీగల్‌సెల్‌కు వచ్చి ఇదంతా చెప్పింది. "నేను సెలవు పెడితే జీతం తగ్గిపోతుంది మేడం మీరు అమ్మతో మాట్లాడి అన్నీ తెలుసుకొని నాకు న్యాయం చేయండి ఇంతగా అసహ్యించుకొనే వారి దగ్గర నేను ఉండలేకపోతున్నాను. మా డబ్బు మాకు ఇచ్చి నానుండి విడాకులు తీసుకోమనండి. నేనంటే ఇష్టం లేని వాళ్ళు నాకూ వద్దు" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.**

చాలా దిగులు పడుతోంది ఈ పరిస్థితిని చూసి. ఈ కుటుంబానికి తన సంపాదనే ఆధారమని అర్థం అయిపోయింది. అటు తల్లి దగ్గర ఆస్తి ఏమీ లేదు. తన పెళ్ళికి దాదాపు 3 లక్షలు ఖర్చు అయింది. ఏదయినా ఉద్యోగం చూసుకోమని భర్తకి చెప్తే కొట్టాడు. "ఏదో మా అమ్మ బలవంతం మీద నిన్ను చేసుకున్నాను. నువ్వు అంటే నాకు అసహ్యం. నేను ఇలాగే వుంటా ఇష్టం అయితే వుండు లేకపోతే వెళ్ళిపోఅన్నాడు". ఇదా తను కోరుకున్న జీవితం. అన్ని విధాలా సర్దుకుపోయి గుట్టుగా బతుకుతుంటే పెళ్ళి పేరుతో వంచించారు. అదేమంటే రోజూ కొడతాడు. ఈ ఇంటికి నేనొక పని మనిషిని డబ్బు సంపాదించే మనిషిని. ఈ పెళ్ళి వలన తన జీవితం ఎంత నరకమయిందో అమ్మకు చెప్పింది. అమ్మ కుల పెద్దలకు చెప్పి పంచాయితీ పెట్టించింది. అక్కడ కూడా అదే మాట ఆమె నాకు ఇష్టం లేదు. మా కుటుంబాన్ని పంచాయితీకి తెచ్చి రచ్చచేస్తుంది. అసలు నాకు ఆమె వద్దు అన్నాడు భర్త. మధు అత్తగారు కూడా అతనికే వంత పాడింది.

నాకేం తక్కువ నేనెందుకు వాళ్ళకు నచ్చడం లేదు. నన్ను ఎందుకు ఇంత అవమానానికి గురి చేస్తున్నారు. నేనేమీ వారి వెంట పడలేదే. పెళ్ళి చేసుకోమని అడగలేదు కదా! వాళ్ళే వెంటబడి ఒప్పించి చేసుకున్నారు. మరి ఇదంతా ఏమిటి? అని ఆలోచించింది. తల్లితో కలసి ఆమె ఐద్వా లీగల్‌సెల్‌కు వచ్చి ఇదంతా చెప్పింది. "నేను సెలవు పెడితే జీతం తగ్గిపోతుంది మేడం మీరు అమ్మతో మాట్లాడి అన్నీ తెలుసుకొని నాకు న్యాయం చేయండి ఇంతగా అసహ్యించుకొనే వారి దగ్గర నేను ఉండలేక పోతున్నాను. మా డబ్బు మాకు ఇచ్చి నానుండి విడాకులు తీసుకోమనండి. నేనంటే ఇష్టం లేని వాళ్ళు నాకూ వద్దు" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది. అబ్బాయికి, తల్లికి లెటరు పంపించాము ఐద్వా నుండి. ఇద్దరూ వచ్చారు మళ్ళీ వారం. వారిని అన్నీ విచారించాము. భార్యా భర్త ఎప్పుడూ గొడవలు పడుతున్నారు, ఇద్దరూ సఖ్యతగా లేరు. ఆమె నా కొడుకు మాట వినదు తన పుట్టింటికి వెళ్ళిపోయింది. మమ్మల్ని కుల పెద్దల దగ్గరికి పంచాయితీకి పిలిచారు. అది మాకు చాలా అవమానంగా వుంది అని చెప్పింది అత్తగారు.

"మీరు అన్నీ అబద్ధాలే చెప్పారు. ఆమెను ఒక పనిమనిషి మాదిరిగా చూసారు. కొట్టారు, తిట్టారు ఇవన్నీ మీరు చేసిన తప్పులు" అన్నారు ఐద్వా బాధ్యులు. అబ్బాయి కూడా మాకు విడాకులు ఇమ్మని అడిగాడు. ఆమె దగ్గర తీసుకున్న సొమ్ము, వారు ఇచ్చిన నగలు అదంతా మీరు ఆమెకు ఇవ్వాలి. పెళ్ళిలో వారు ఇచ్చిన 80వేలు, వారు ఇచ్చిన నగలు మరియు నష్టపరిహారం లక్ష ఇరవై వేలు ఇవ్వాల్సి వుంటుంది. అదంతా ఇచ్చి ఆమెనుండి విడాకులు తీసుకోండి అని ఒప్పందం రాశాము. మూడు నెలలు టైము ఇచ్చాము ఆరు నెలలు అయినా రాలేదు. సుధ తల్లి వచ్చి అడిగితే మధుకు ఫోన్ చేశాము. మా వార్డు కార్పొరేటర్ దగ్గర 60వేలు ఉంచాము. ప్రస్తుతానికి అది తీసుకోమనండి మిగతాది మరో మూడు నెలలు వ్యవధి ఇవ్వండి అని అడిగారు. మూడు నెలలకి వడ్డీ ఇవ్వమని బాధ్యులు చెప్పారు. సుధ తల్లి కార్పొరేటర్‌ను వెళ్ళి అడిగితే "తల్లి కొడుకులు మా దగ్గరికి వచ్చిన విషయం ఓకేగానీ డబ్బు మాత్రం మాకేం ఇవ్వలేదని" చెప్పారు. ఇది జరిగి దాదాపు 10 నెలలు కావస్తోంది. సుధ తల్లి "మాకు మీరు అండగా ఉండండి అమ్మా ఆ మోసగాడి మీద పోలీసు కేసు పెడతాము అన్నది". "ఆ వచ్చే డబ్బు అమ్మాయి పేర వేస్తే మా బతుకు మేము బతుకుతాము. అది కూడా లేకుంటే మాకు జీవితమే కష్టం అన్నది సుధ తల్లి. వాళ్ళిద్దరికీ ఐద్వా బాధ్యులు ధైర్యం చెప్పి మీకు మేము తోడుంటాము అని చెప్పి కేసు పెట్టించారు. కేసు పెట్టాక సుధను ఐద్వా లీగల్ సెల్‌కు రమ్మన్నాము. ఆమె వాళ్ళ అక్క ఇద్దరూ వచ్చారు. అమ్మా! నువ్వు ధైర్యంగా ఉండు. వివాహం జీవితంలో ఒక భాగం మాత్రమే. అది విఫలమైనంత మాత్రాన మొత్తం జీవితం వేస్ట్ అనుకునే రోజులు కావివి. ఎలాగైనా వాళ్ళ వద్దనుండి డబ్బు రప్పిస్తాము. మీకు ఎంతో జీవితం ముందుంది. అది నిత్య నూతనంగా ఉండడానికి నీ శాయశక్తులా ప్రయత్నించు అని చెప్పి ఆమెను పంపించారు. ఆమె డబ్బు ఆమెకు అంది ఆమె జీవితంలో మంచిరోజులు వస్తాయని ఆశిద్దాము. ●

వైద్యం

# తరచూ తలనొప్పి బాధిస్తోందా?

- డాక్టర్ ఎం. రమాదేవి

చాలామంది స్త్రీలలో తలనొప్పి పెద్ద సమస్య. పడుకుంటే కుదరదని అలాగే పనులు చేసుకుంటూ ఉంటారు. చూసే వాళ్ళకు చిన్న సమస్యగా కనిపించే ఈ బాధ స్త్రీలను చాలా ఇబ్బంది పెడుతుంది. తలనొప్పి రాని వాళ్ళెవరూ వుండరు. 99 శాతం మందికి అప్పుడపుడు తలనొప్పి వచ్చిపోతూ వుంటుంది.

**కారణాలు:** సాధారణంగా ఆలోచనలు, టెన్షన్, ఆశాభంగం, విశ్రాంతి లేకపోవడం, అపజయాలు, మనశ్శాంతి లేకపోవడం, వాతావరణంలో మార్పులు, ఆహారపు అలవాట్లలో మార్పులు... ఇలా మామూలు కారణాల వలన కూడా తలనొప్పి రావచ్చు.

**ఆరోగ్యసంబంధమైన కారణాలు :** రక్తపోటు, మైగ్రేయిన్, సైనసైటిస్, మెనోపాజ్, బహిష్టు రావడానికి ముందు, మలబద్ధకం లాంటి కారణాల వలన తలనొప్పి వస్తుంది. అంతేకాదు చెవిపోటు, పిప్పిపన్ను, సమయానికి ఆహారం తీసుకోకపోవడం, కళ్ళకు శ్రమ వలన కూడా వచ్చే అవకాశం వుంది. ఈ రకంగా చెప్పాలంటే దాదాపు యాభైకి పైగా స్పష్టమైన కారణాలు ఉన్నాయి.

**టెన్షన్ తలనొప్పి:** ఏదైనా తీవ్రమయిప ఆలోచన కానీ, సమస్యగానీ వచ్చినా, ఉద్రిక్తత పెరిగినా, పనిభారం ఎక్కువ అయినా టెన్షన్ తలనొప్పి వస్తుంది. ఎక్కువగా చదివినా, రాసినా, ఆలోచించినా కూడా ఈ రకం తలనొప్పి రావచ్చు. ఈ రకం తలనొప్పి సాధారణంగా మధ్యాహ్నం, సాయం కాలాల్లో వస్తుంది.

నుదురు, దాని ప్రక్కన వుండే సన్నని కండరాలు బిగుసుకు పోతాయి. కణతలు,



నుదురు, కళ్ళపైన, తల వెనుక భాగంలో నొప్పి రావచ్చు. తలంతా మొద్దుబారినట్లు వుండటం, మెడ, భుజాలు కూడా నొప్పిగా వుండవచ్చు

టెన్షన్ తలనొప్పి వచ్చినవారు పారాసెటమాల్ టాబ్లెట్ ఒకటి వేసుకోవచ్చు. మెడ, భుజాల వద్ద వేడినీటి కాపడం పెట్టడం, విశ్రాంతిగా కళ్ళు మూసుకుని పడుకోవటం వల్ల ఉపశమనం కలుగుతుంది. 60 శాతం మందికి టెన్షన్ తలనొప్పులే వస్తుంటాయి.

**కళ్ళు అలసట :** కంటి చూపులో సమస్యలు, కంటి కండరాలకు అధిక శ్రమ వలన ఈ సమస్య వస్తుంది. కంప్యూటర్‌తో ఎక్కువసేపు పనిచేయటం, పుస్తకాలను కంటికి దగ్గరగా పెట్టి చదవటం, తక్కువ వెలుతురులో చదవటం, రాయటం వల్ల కూడా తలనొప్పి రావచ్చు. కళ్ళు అలసట వలన కలిగే తలనొప్పిలో తలంతా బరువెక్కినట్లు, కళ్ళు లోపలికి గుంజుతున్నట్లు అనిపిస్తుంది. కంటి డాక్టరుకు చూపించుకుని అవసర మైతే కంటి అద్దాలు వాడాలి. కంటి జబ్బులేమైనా వున్నాయేమో పరీక్ష చేయించుకోవాలి.

**రక్తపోటు :** అధిక రక్తపోటు వలన వచ్చే తలనొప్పి నడినెత్తిన బాగా నొప్పిని కలిగిస్తుంది. శరీరమంతా విపరీతంగా చెమటలు పడతాయి. గాభరా, వికారం, వాంతులు వుంటాయి. ఈ రకం తలనొప్పి సాధారణంగా ఉదయం నిద్ర లేవగానే మొదలవుతుంది. దీనికి రక్తపోటు నార్మల్‌గా వుండేట్టు చూసుకొని, రోజూ బిపి టాబ్లెట్లు వాడాలి. వేరే ఎటువంటి చికిత్స పని చేయదు.

**సైనసైటిస్ తలనొప్పి:** తలనొప్పులలో పదిశాతం సైనసైటిస్ వలన వస్తాయి. ఈ తలనొప్పి ముఖం పై భాగం ఎముకల దగ్గర ఎక్కువగా వుంటుంది. వంగినపుడు, తల త్రిప్పినపుడు బాగా ఎక్కువవుతుంది.

మిగతా 40వ పేజీలో..

# అవగాహన సందర్భం స్త్రీలపై ఈ వికృత హింసలు ఇంకెన్నాళ్ళు!?

- శిలాలోలిత

ప్రజలకోసం ప్రాణాలొడ్డిన మరో ప్రాణి మమత. పేరులోనే ఎంత మాధుర్య ముందో కదా! మమత నిండిన సమాజం కోసం, మానవత్వపు సమాజాన్ని నిర్మించడం కోసం మనకళ్ళముందే నేలరాలింది. ఒకమనిషిగా మనుషులకోసం ఆమె పోరాడితే, ఆమెనూ 'అంగం'గానే రాజ్యం చూసింది. ఎంతహింస, ఎంత హింస. స్తనాలు లేవు, తలలేదు, చిన్నాభి న్నమైన శరీరభాగాలు అసలు వాళ్ళు మనుషులేనా? మనిషి అన్నపదం కూడా సరిపోదు పోల్చలేం. ఏమనాలి వాళ్ళని స్త్రీలమీద ఎందుకంత కసి? స్త్రీనింకా అవయ వంగానే ఇంకెన్నాళ్ళు చూస్తారు? వెసుముక్కల కుప్పలో వెలికి తీస్తున్న కుటుంబ సభ్యుల, హితుల, స్నేహితుల హృదయాలన్నీ ఏమై ఉ ంటాయి? మనుషులం కదా! ఇంతింత క్రూరమైన చేష్టల్ని ఇంకెన్నాళ్ళు తట్టుకుంటాం.

ఈ దృశ్యాన్ని గురించి ఆలోచిస్తుంటే, ఆవేదనపడ్తుంటే స్నేహలత గుర్తొచ్చింది. 1975లో 'ఎమర్జెన్సీ' టైంలో అరెస్ట్ చేయబడింది. ప్రజాస్వామ్య దేశంలో, బలవంతపు పోలీసు జులుంతో స్నేహలత చెరసాల పాలైంది. సుకుమారమైన అంద మైన ఆమె శరీరం ఆటవస్తువైంది. స్నేహ లత పోలీసు దురాగతాలకు బలైపోవడాన్ని చూసి ఆగ్రహంతో 'అనసూయ' 'స్నేహాభి రామం' పేరిట కవిత్వపుస్తకాన్ని రాసింది. పోలీసుల హింసపై తీవ్రమైన నిరసనను వ్యక్తీకరించింది.

"ఒక నియంతృత్వమ్ము ఒక రాక్షసత్వము

అధికార దురహంకార ఘోరమ్ము

గగన విహంగాల రెక్కలు విరిచి కట్టింది.

పసి ప్రజాస్వామ్యమ్ము పాతిపెట్టింది

ఒక దురాశాయుక్తి ఒక పీడనాసక్తి

నిత్యగ్రహోదగ్ర నిర్ణిద్ర పశుశక్తి

వెలుగుకై పాడితే చెరసాల త్రోసింది."

**అధికారం అనేది ఏ యుగంలోనైన ప్రజలమీద ఒకే రకంగా ప్రవర్తిస్తుంది. నాటి ద్వాపరయుగానికీ నేటికీ తేడా లేదు. అంటూనే చరిత్ర పునరావృతం కావటం వ్యధాభరితం, శోచనీయమంటుంది అనసూయ. ఈమె స్నేహలత ఆడబడుచు. కానీ బంధుత్వం కంటే గొప్ప స్నేహితురాలు ఆమెకు. కారాధికారి ఒక కారడవి మృగము కాదు కాదొక క్షుద్ర కపట కీటకము నిలబెట్టి నిలువునా వలువలొలిచాడంట ద్వాపరము నాటి వస్త్రాపహరణ కథ ఈ నాడుకు పునరావృత మగుట వ్యధ!**

అధికారం అనేది ఏ యుగంలోనైన ప్రజలమీద ఒకే రకంగా ప్రవర్తిస్తుంది. నాటి ద్వాపరయుగానికీ నేటికీ తేడా లేదు. అంటూనే చరిత్ర పునరావృతం కావటం వ్యధాభరితం, శోచనీయమంటుంది అన సూయ, ఈమె స్నేహలత ఆడబడుచు. కానీ బంధుత్వం కంటే గొప్ప స్నేహితురాలు ఆమెకు. కారాధికారి ఒక కారడవి మృగము

కాదు కాదొక క్షుద్ర కపట కీటకము నిలబెట్టి

నిలువునా వలువలొలిచాడంటద్వాపరము

నాటి వస్త్రాపహరణ కథ

ఈ నాడుకు పునరావృత మగుట వ్యధ!

కారాధికారిని కారడివి మృగము క్షుద్ర కపట కీటకములాంటి పదాలతో తన ఏహ్యతను, అవేశాగ్రహాలను ప్రదర్శిం చింది. స్నేహలత మనసు సున్నితమైందే కానీ, సంకల్పం దృఢతరమైనటువంటింది.

ఈ ఘోరానికి స్నేహలత కళ్ళలో తడిలేదు

కార్చిచ్చులేకాని

మనసులో వెరలేదు మహా

నీయతే గాని- అంటూ ఆమె వ్యక్తిత్వాన్ని చిత్రించింది. ఆమె మనోబలాన్ని చెబుతూ, స్త్రీత్వానికొక ప్రత్యేకమైన నిర్వచనాన్ని కూడా ఇచ్చింది.

స్త్రీత్వమంటే అబలచేయు

రుదితము కాదు

స్త్రీత్వములో దైన్యరేఖ లేనేలేదు...

రుదితమనేది ఆ తీవ్రత వల్ల జరిగే చర్య మాత్రమే, అదిఎవరు చేసినా బలహీనతే. పరిస్థితుల ప్రాబల్యంవల్ల అసంకల్పితంగా కన్నీరు వస్తుంది. అంతేతప్ప రుదితము స్త్రీత్వము కాదని చెబ్తుంది

'విమల'- 'స్వర్ణలత కోసం' రాసిన కవితలో ఎంతో ఆర్తిగా విప్లవ పోరాటంలో

సమసిపోయిన ఆమెకోసం పడిన తపన కనిపిస్తుంది.

అడవి చెట్లను మీటి
రణన్నినాదమై మ్రోగు
బావుటాయై బాటచూపును
గుండె గుండెను తట్టి లేపును
చెల్లెలా! ఓ చెల్లెలా నీవు వినిపించనిదెక్కడ తల్లీ

లలితవో/పద్మవో/పంచాది నిర్మలవో
జ్యోతివోలే వెలిగిన దానవో ఈ నాడిక
నీ అడుగుల వాడి వారవడియగు
కన్నీట నీరూపు చెదర/ కనులు తుడుచుకు నిను నిలుపుకుందు
కానరాని నిన్నిక పోరుదారిన చూతు'

- అని స్మరిస్తుంది.

జయప్రభ-'నేను' అన్న కవితలో- 'ఈ సమరంలో రాలినా ఓడిపోనునేను
మరో జ్యోతిగా మరునిముషంలో అవతరిస్తాను. అనే దృఢనిశ్చయాన్ని తెలియజేస్తుంది.

'ఈశ్వరి' కవిత్వంకూడా విమల కవిత్వంలా శక్తిమంతమైంది. పోలీసుల చేతుల్లో పడిన తర్వాత పరిస్థితి వివరిస్తూ

శరీరంలో
శత్రువు చేత చిక్కిన నన్ను
హింసించిన వైనం నీ కెరికే
అర్ధరాత్రి చిమ్మచీకటిలో బయటి కొచ్చిన
నాపై వెనకనుంచి
కంబళి వల విసిరారు
అరవకుండా నోరునొక్కారు

అదేపనిగా ఇద్దరు పడిఎత్తుకు పోయారు ('అడవికి అంకితమవ్వాలని') పోలీసులు పెట్టే శారీరక హింసను, వారినైచ్యాన్ని ఈ కవితలో ఏవగించుకుంటుంది.

''ఓల్గా'' - 'పంచాది నిర్మల వారసురాల్ని' అని ప్రకటించుకొంటూ 1972 లోనే ఉద్యమ కారిణులపై తనకున్న గౌరవాన్ని కవితారూపంలో ప్రకటించింది. అప్పటినుంచీ ఇప్పటివరకూ మారని స్త్రీల స్థితినే, సమాజాన్నే చూస్తున్నాం మనం. మమతలింకా రాలిపోతూనే ఉన్నారు. హింసా రూపాలు రోజు రోజుకీ వికృత రూపాల్ని ధరిస్తూనే ఉన్నాయి. వింటున్నాం. చూస్తున్నాం. అయ్యో అనుకుంటున్నాం. నిర్లిప్తంగా మిగిలిపోతున్నాం. ✷

---

**38వ పేజీ తరువాయి..**

కళ్ళపైన. కళ్ళ మధ్య, ముక్కు పై భాగాన చాలా నొప్పిగా వుంటుంది. మధ్యాహ్న సమయాల్లో ఈ రకం తలనొప్పి ఎక్కువగా వుంటుంది. కొందరికి జలుబు, జ్వరం, ముక్కునుండి నీరు కారటం వంటివి కూడా వుంటాయి.

ఈ నొప్పికి బాగా మరగకాచిన నీటి ఆవిరిని దుప్పటి ముసుగువేసుకుని ముక్కులతో బాగా పీల్చాలి. వేడినీటిలో కొంచెం ఉప్పుగాని, తలనొప్పి బామ్‌గాని వేసి పీల్చవచ్చు. సైనసైటిస్‌కి సంబంధించిన ఎక్స్‌రే తీయించి డాక్టరు సలహాపై మందులు వాడాలి.

**మైగ్రేయిస్ తలనొప్పి:** ఇది చాల తీవ్రమైన తలనొప్పి. దీన్నే పార్శ్వ నొప్పి అనికూడా అంటారు. తల పగిలిపోతున్నంత నొప్పిగా వుంటుంది. వికారం, వాంతులు వుంటాయి. వెలుతురును ఏమాత్రం చూడలేరు.

నిద్ర చాలకపోవటం, అధిక శ్రమ. నూనె పదార్థాలు, చాక్లెట్లు అధికంగా తినడం, బహిష్టు, గర్భ నిరోధక మాత్రలు వాడటం, ఎండలో తిరగడం లాంటివి కారణాలుగా వుంటాయి. ఈస్ట్రోజన్ తక్కువైన వాళ్ళలో ఈ రకపు తలనొప్పి తరచుగా వస్తుంది.

మైగ్రేన్ తలనొప్పి వచ్చినపుడు చీకటిగా, బాగా గాలివచ్చే గదిలో విశ్రాంతిగా పడుకుని నిద్రపోవటానికి ప్రయత్నించాలి. భోజనం తగ్గించాలి. పళ్ళరసాలు, కొబ్బరి నీళ్ళు తీసుకోవచ్చు. తరచుగా వస్తుంటే డాక్టర్ సలహాతో మందులు వాడాలి.

**ఆకలి తలనొప్పి :** దాదాపు అయిదు గంటల పాటు ఏమీ తినకుండా ఖాళీ కడుపుతో వుండటం, ఉపవాసాలు చేస్తూ నిద్ర మేల్కొనే వారిలో ఈ రకం తలనొప్పి ఎక్కువగా వస్తుంది. తలనొప్పితో పాటు కడుపులో మంట కూడా వుంటుంది.

ఈరకపు తలనొప్పి వచ్చినప్పుడు నొప్పి టాబ్లెట్లు వేసుకోకూడదు. మాత్రలు పనిచేయకపోగా కడుపులో మంట ఎక్కువవుతుంది. కాఫీ, టీలు తాగకూడదు. కార్బోహైడ్రేట్లు ఎక్కువ వుండే ధాన్యాహారాలను వేళకు భోజనంలో తీసుకోవాలి.

# మాతా శిశు సంరక్షణ ఐ.సి.డి.ఎస్. లక్ష్యం

1. అన్న అమృత హస్తం పథకంలో భాగంగా 72,655 గర్భవతులకు, బాలింతలకు ఒక పూట సంపూర్ణాహారం అందించడం.

2. పూర్వ ప్రాథమిక విద్య 1,00,329 మంది పిల్లలకు ఆట పాటల ద్వారా విద్య

3. బరువు తక్కువగా ఉన్న పిల్లలకు ప్రత్యేక పర్యవేక్షణతో కూడిన ఫీడింగ్

4. పిల్లలపై వేధింపులు, గృహ హింస నిరోధక చట్టం మరియు అక్రమ రవాణాను నిరోధించుటకు కృషి.

5. బాల్య వివాహాల నియంత్రణ ద్వారా మాతా శిశు మరణాలను తగ్గించుటకు కృషి.

శ్రీ కోనా శశిధర్,
ఖాజా మొహిద్దీన్ 2వ సంయుక్త కలెక్టర్,
ఎస్.జుబేదా బేగం
అనంతపురం జిల్లా.

**ఆరోగ్యవంతమైన పిల్లలే - రేపటి ఆరోగ్యవంతమైన సమాజం**

శ్రీ సత్యదేవ నిత్య అన్నదానం ట్రస్టు

# శ్రీ వీర వెంకట సత్యనారాయణ స్వామివారి దేవస్థానం

శ్రీ రుచిర రత్న శైలాగారా
సద్భక్తహృదయ కమల విహారా



కారుణ్యామృతమయకాసారా
శ్రీసత్యదేవ జగదాధారా

భక్తులు యావన్మందికి శ్రీ సత్యదేవుని శుభాశీస్సులు

అన్నవరం, తూర్పుగోదావరి జిల్లా, ఫోన్స్-(అన్నదానం-08868239137, ఇ.ఓ.పేషీ-239123, రిసెప్షన్-238163)

శ్రీ మహావిష్ణువు రామావతారంలో రత్నాకరుడు అనే భక్తుని తపస్సుకు మెచ్చి వరం కోరమనగా, దేవా! నిన్ను నా శిరముపై మోసే భాగ్యాన్ని ప్రసాదించు అని అడిగాడట. "కలియుగంలో భక్త సంరక్షణార్థం త్రిమూర్తులు ఏకస్వరూపముగా సత్య తమోరూప త్రిగుణాత్మకుడైన వీర వెంకట సత్యనారాయణ స్వామి అను పేరుతో అర్చామూర్తిగా ఆవిర్భవించిన సుముహూర్తాన నీవు రత్నగిరి రూపంలో నీ శిరస్సున నన్ను వసిస్తావు." అని సాక్షాత్ విష్ణుమూర్తి రత్నాకరునికి వరమిచ్చాడు. ఆ ప్రకారమే రత్నగిరి తన శిరస్సుపై సత్యదేవుని మోస్తున్న పరమపావన దృశ్యం భక్తులకు కన్నుల వైకుంఠంగా దర్శనమవుతుంది.

భక్తులు అన్నదానము నిమిత్తము ఈ క్రింద తెలిపిన విధముగా విరాళములు ధన రూపములోనే కాకుండా అన్నదానము నిమిత్తము అవసరమగు సంభారములద్వారా కూడా శ్రీ స్వామి వారికి సమర్పించుకొనవచ్చును. అనగా కూరగాయలు, పండ్లు ఫలములు మరియు బియ్యము, పప్పుల రూపములో కూడా సమర్పించుకొనవచ్చును. కూరగాయలు సమర్పించదలచుకొన్న భక్తులు ఎక్కువ మొత్తములో కూరగాయలు వున్నచో దేవస్థానము వారికి ఈ దిగువ ఉదహరించిన అధికారులను ఫోను ద్వారా సంప్రదించినచో దేవస్థానము వారు స్వయముగా వచ్చి దేవస్థానము వారి వాహనములోనే తీసుకొనిపోవుదురు. తక్కువమొత్తములో వున్న కూరగాయలు భక్తులే స్వయముగా వచ్చి అన్నదాన విభాగము నందు అప్పగించవలసియుండును.

భక్తులు అన్నదానము నిమిత్తము అరటి పండ్లు మరియు ఇతర ఫలములు (మామిడి మొ.) సమర్పించినచో సదరు ఫలములు భోజన సమయమునందు భక్తులకు వడ్డించబడును. దాతలు స్వీట్సు రూపములో (రవ్వకేసరి మరియు సేమ్యా మాత్రమే) దానము చేయుటకు సంకల్పించినచో ఒక రోజు ముందుగా అన్నదాన విభాగమునందు నిర్ణయించిన విరాళము చెల్లించి రశీదు పొందినచో దాతలు కోరిన ప్రకారము ఏర్పాటు చేయబడును. మరియు దాతలు పాలు కూడా ప్యాకెట్లు రూపములో (ప్రభుత్వ అధీకృత డీలర్లు సరఫరా చేసినవి మాత్రమే) విరాళముగా సమర్పించవచ్చును.

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రూ. 1,00,000/-లు ఆపైన |
| రాజపోషకులు | రూ. 50,000/- లు ఆపైన |
| పోషకులు | రూ. 10,000/- లు ఆపైన |
| దాతలు | రూ. 1,000/- లు ఆపైన |

పైన తెలిపిన ధనరూప విరాళములను ఏ జాతీయ బ్యాంకు నుండైనా డి.డి./చెక్కు ద్వారా కార్యనిర్వహణాధికారి, శ్రీ సత్యదేవ నిత్య అన్నదానం ట్రస్టు, శ్రీ వి.వి.ఎస్.ఎస్.దేవస్థానం, అన్నవరం పేరున పంపించవచ్చును. దీనితోపాటు చెల్లించిన వారిపేరు, గోత్రం, చిరునామా (ఫోన్ నెంబరుతో సహా), ఎవరి పేరున జరిపించవలెను, తేది లేక తిథి, విరాళం మొత్తం వివరములను తెలియజేయవలసినదిగా కోరడమైంది.

సంప్రదించవలసిన ఫోన్లు: సహాయకార్యనిర్వాహణాధికారి: 9491249983, పర్యవేక్షణాధికారి: 9491249976.

అన్నదాన పథకమునకు చెల్లించిన విరాళములపై ఆదాయపన్ను మినహాయింపు 80(జి) సౌకర్యము కలదు.

**k.Nageswararao,** M.Sc,
spl.Gr.Dy.Collector&Executive Officer

# ఉద్యమాల బాటలో..



గుంటూరులో..






**ఈవ్‌టీజింగ్‌ను తిప్పికొడదాం..**

విద్యార్థినులను ఈవ్‌టీజింగ్ చేసే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని, ఈ చర్యను అంతా కలిసి సమర్థంగా తిప్పికొట్టాలని ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డి. రమాదేవి పిలుపునిచ్చారు. ఎస్ఎఫ్ఐ ఆధ్వర్యంలో గుంటూరు ప్రభుత్వ బాలికల జూనియర్ కళాశాలలో ఈవ్‌టీజింగ్ నియంత్రణపై అవగాహన సదస్సు జరిగింది. సినిమాలు, ప్రాశ్చాత్య ప్రభావాలు విద్యార్థులపై ఎక్కువ ప్రభావం చూపుతున్నాయి. ధైర్యం, ఆత్మస్థైర్యం నిలుపుకుని ఉన్నత విద్యను అభ్యసించి గొప్ప పౌరులుగా విద్యార్థులు ఎదగాలి. విద్యార్థినులు, మహిళలపై దాడులు పెరిగిపోతున్నాయని, వీటన్నిటికి వ్యతిరేకంగా పోరాడాల్సి ఉంది. తాత్కాలిక ఆనందాలను పక్కనపెట్టి మంచి భవిష్యత్తుకోసం విద్యార్థులు కృషి చేయాలని కోరారు. కళాశాల ఎన్ఎస్ఎస్ ప్రోగ్రాం అధికారి పూర్ణానందం, ప్రిన్సిపల్ శారద, ఎస్ఎఫ్ఐ నుంచి మనోజ్, జ్యోతి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**కొమర్రాజు అచ్చమాంబ లైబ్రరి మరియు రీడింగ్ రూమ్ ప్రారంభం:**

విజయవాడ మారుతినగర్‌లోని ఐద్వా రాష్ట్ర కార్యాలయంలో మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో ప్రముఖ వైద్యురాలు, మహిళా ఉద్యమకారిణిడా॥ కొమర్రాజు అచ్చమాంబ పేరుతో లైబ్రరి మరియు రీడింగ్ రూమ్‌ను ప్రజారోగ్య వేదిక రాష్ట్ర అధ్యక్షులు డా॥ ఎస్. సుధాకర్‌గారు ప్రారంభించారు. ట్రస్టు కార్యదర్శి కె. స్వరూపరాణి అధ్యక్షతన జరిగిన ప్రారంభసభలో ముఖ్య అతిధి డా॥ సుధాకర్ గారు మాట్లాడుతూ పుస్తకాలు చదవటం అనే మంచి అలవాటును ఈ తరం యువతకు, పిల్లలకు తిరిగి అలవాటు అయ్యే విధంగా చూడాలి. డా॥ కొమర్రాజుఅచ్చమాంబ జీవిత కథను నవల రూపంలో తీసుకువచ్చిన ఓల్గా బుక్ 'గమనమే గమ్యం' బుక్‌ను ప్రతి ఒక్కరూ చదవవలసిన అవసరం ఉందని అన్నారు. ఆనాడు విద్య కోసం ఆడపిల్లలు చేసిన పోరాట ఫలితమే నేటి యువతకు విద్య ఈ విధంగా అందుబాటులోకి వచ్చిందని అన్నారు. ప్రముఖ రచయిత పి. సత్యవతి మాట్లాడుతూ నేటి విద్యా విధానంవల్ల విద్యార్థులు క్లాసు పుస్తకాలు తప్పితే వేరే పుస్తకాలు చదివే పరిస్థితి కానరావటం లేదన్నారు. పుస్తక పఠనం యువతకు లోకజ్ఞానాన్ని, విజ్ఞతను నేర్పుతుందన్నారు. ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి మాట్లాడుతూ మారుతి నగర్ ప్రాంతంలో విద్యార్థినులకు, మహిళలకు అందుబాటులో ఉండే దానికి ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో రీడింగ్ రూమ్ ప్రారంభించటం

జరిగిందని, పేద కుటుంబాలలో చదువుకునే పిల్లలకు ఉచిత ట్యూషన్ సెంటర్ కూడా ఏర్పాటుచేసే ప్రయత్నం చేస్తున్నామని, వీటిని ఉపయోగించుకోవాలని కోరారు. ఈ కార్యక్రమంలో రచయిత డి. శమంతకమణి, జర్నలిస్టు శాంతిశ్రీ, ఐద్వా ఉపాధ్యక్షురాలు కె. శ్రీదేవి తదితరులు పాల్గొన్నారు.

**లవ్ ఫెస్టివల్ నిర్వహణను విరమించుకోవాలి:**


విశాఖ

ప్రేమికుల దినోత్సవం సందర్భంగా విశాఖ తీరంలో బీచ్ లవ్ ఉత్సవాన్ని నిర్వహించేందుకు రాష్ట్ర ప్రభుత్వం సన్నాహాలను చేస్తుంది. పర్యాటకాభివృద్ధి, పెట్టుబడుల ఆకర్షణ పేరిట విశృంఖల,పాశ్చాత్య సంస్కృతికి దోహద పడే నృత్యాలు, ఆట పాటల నిర్వహణకి ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చినట్లుగా వార్తలు వస్తున్నాయి. దేశ విదేశాల నుంచి 9 వేల జంటలను ఆహ్వానించటం ద్వారా స్త్రీల అందాల ప్రదర్శనలతో నేటి యువతను ఆకర్షించేందుకు ప్రయత్నిస్తోంది. ఈ సందర్భంగా నగరంలో ఫ్యాషన్ షోలు, ప్రఖ్యాత పాప్ గాయనీ గాయకులతో బెల్లీ డాన్స్, షకీరా ఆటపాటలు హాలీవుడ్ బాలీవుడ్ తారలు, అందాల పోటీలను విశాఖ పర్యాటక శాఖ అధికారులు ఏర్పాటు చేస్తున్నట్లు తెలుస్తున్నది. ఈ మొత్తం కార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వ సహకారంతో ముంబైకి చెందిన పాజిటివ్ గ్లోబల్ సర్వీసెస్ అండ్ కన్సల్‌టెన్సీ అనే ప్రయివేటు సంస్థకి అప్పగించనున్నది. ఫిబ్రవరి 12వ తేదీ నుండి ప్రేమికుల దినమైన 14వ తేదీ వరకు ఉత్సవాలు జరపాలని సన్నాహాలు చేస్తున్నట్లు తెలుస్తున్నది.

స్మార్ట్ సిటీగానూ, పారిశ్రామికంగా విశాఖపట్టణాన్ని అభివృద్ధి చేస్తానంటున్న చంద్రబాబు నాయుడు పర్యాటకం పేరుతో ప్రశాంతంగా ఉన్న విశాఖ నగరాన్ని బీచ్ లవ్ ఫెస్ట్ పేరుతో యువతను పెడదారి పట్టించనున్నదా? యువతీయువకులకు ఉపయోగపడని లవ్ ఫెస్టివల్ నిర్వహిచడం పనికిమాలిన పని. మహిళా సాధికారిత పేరుతో ప్రతి రోజూ ప్రకటనలు ఇచ్చే ముఖ్యమంత్రి మహిళల అర్ధనగ్న ప్రదర్శనలు, అశ్లీల నృత్యాలతో వ్యాపారం చేయాలని నిర్ణయించడాన్ని ఐద్వా తీవ్రంగా ఖండిస్తుంది.

దేశంలో మహిళలపై జరుగుతున్న నేరాలలో ఆంధ్రరాష్ట్రం 3వ స్థానంలో వుంది. నేరాలను అదుపు చేసేందుకు తగు చర్యలు లేకపోగా రాష్ట్రంలో విచ్చలవిడిగా మద్యం అమ్మకాలు పెంచి మహిళలపై వేధింపులను, నేరాలను పెంచుతుంది. టూరిజం పేరుతో మరింత విశృంఖలతను పెంచుతున్న పోకడలు వ్యక్తమవుతున్నాయి. భారతీయ సంస్కృతి సాంప్రదాయాలకు భిన్నంగా లవ్ ఫెస్టివల్ నిర్వహించడాన్ని మేధావులు, అభ్యుదయ వాదులు, ప్రజాతంత్ర ఉద్యమకారులు, యువతీ యువకులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్న ఈ నిర్ణయాన్ని ప్రభుత్వం వెనక్కి తీసుకోవాలని డిమాండ్ చేస్తూ వైజాగ్‌లో అన్ని మహిళా సంఘాల ఆధ్వర్యంలో జివిఎంసి వద్ద రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది.

బీచ్ బార్ల ఏర్పాటుకు ప్రభుత్వం విడుదల చేసిన జివొ 470ని రద్దు చేయాలని 50మందితో విజయవాడ పంజా సెంటర్‌లోధర్నా, విశాఖ అరిలోవ, జగదాంబ సెంటర్ వద్ద నిరసన కార్యక్రమాలు జరిగాయి.



**శ్రీకాకుళం జిల్లా అడపాక గ్రామ దళితులపై దాడి**

శ్రీకాకుళం జిల్లా లావేరు మండలం అడపాక గ్రామంలో 11.10.2016న దసరా రోజున రెల్లి కులానికి చెందిన రాగోలు గురువులు బెల్టు షాపుకెళ్ళి మందు తాగి చిల్లర అడిగాడు. దుకాణం యజమాని శశిభూషణరావు చిల్లర ఇస్తా వుండు అని చెప్పాడు.

కొద్దిసేపయ్యాక మరలా చిల్లర అడగగా నీకు చిల్లర ఇచ్చేసానుకదా అన్నాడు. గురువులు నాకు చిల్లర ఇవ్వలేదని ప్రశ్నించడంతో నన్నే ప్రశ్నిస్తావా అని ప్రక్కనే వున్న దుడ్డుకర్రతో బాదాడు. గురువులు స్పృహతప్పి పడిపోయాడు. గొర్రెల శశిభూషణరావు బ్లేడుతో గాట్లు పెట్టుకుని రాగోలు గురువులే దాడి చేశాడని చెప్పి కులస్తులనూ పోగుచేశాడు. వారు మూకుమ్మడిగా దళిత పేట మీద దాడిచేసి కొట్టారు. ఇద్దరు వ్యక్తుల మధ్య ఘర్షణను అవకాశంగా తీసుకొని దళితులపై దాడిచేశారు.

మహిళలను వివస్త్రలను చేసి కొట్టారు, లైంగికంగా అవమానపరిచారు. వారిని సాంఘీక బహిష్కరణ చేశారు. శశిభూషణరావు కొట్టిన దెబ్బలకు రాగోలు గురువులుకు రెండు చేతులు విరిగిపోయాయి. పక్కటెముకలు కూడా విరిగిపోయాయి. తలపైన బలమైన గాయాలు పడి 10 కుట్లు పడ్డాయి. అతని భార్య లలితను, పక్కింటి పిన్నింటి కోటేశ్వరి అనే ఆశా కార్యకర్తను కూడా వివస్త్రను చేసి తలపగలగొట్టారు. 6 కుట్లు పడ్డాయి. కుప్పిలి మరియమ్మ, సవలాపు రామలక్ష్మి, పిన్నింటి రత్నాలు తదితర మహిళలను కొట్టారు. జాకెట్లు చింపి వేశారు. రెల్లి కులస్తులను సాంఘిక బహిష్కరణ చేశారు.

ఇంత దారుణమైన దాడి జరిగినా ఇంతవరకు పోలీసులు దోషులను అరెస్టు చేయలేదు. స్థానిక పోలీసులంతా దాడిచేసినవారి పక్షాన వకాల్తా పుచ్చుకొని మాట్లాడుతున్నారు. ఈ దాడిలో కీలకమైన వ్యక్తులుగా వున్న గొర్రెల శశిభూషణరావు, గొర్రెల నాగభూషణరావు, గొర్రెల ఆంజనేయులు, గంట్యాడ సత్యం, మీసాల సూర్యనారాయణ, జె.పాపినాయుడు తదితరులను ఎస్సీ, ఎస్టీ అట్రాసిటీ చట్టం మరియు ఇతర నేరాల క్రింద తక్షణం అరెస్టు చేయాలని, సాంఘీక బహిష్కరణ చేసినవారిపై చర్యలు తీసుకొని దళితులకు న్యాయం చేయాలని ఈ సమావేశం డిమాండ్ చేసింది. ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి అధ్యక్షతన జరిగిన సమావేశంలో కెవిపిఎస్ రాష్ట్ర కార్యదర్శి అంద్ర మాల్యాద్రి, సాధన కన్వీనర్ మాతంగి దిలీప్, దళిత బహుజన ఫ్రంట్ అధ్యక్షులు భాగ్యారావు, రమాదేవి, ఎన్ఎఫ్ఐడబ్ల్యు కార్యదర్శి పి. దుర్గా భవాని, పివోడబ్ల్యు కార్యదర్శి ఆర్. దుర్గా భవాని, రెల్లి సంఘం రాష్ట్ర అధ్యక్షులు అశ్వనీ కుమార్, ఐద్వా ఉపాధ్యక్షురాలు శ్రీదేవి, కెవిపిఎస్ రాష్ట్ర నాయకులు క్రాంతి తదితరులు పాల్గొన్నారు.

దళితులపై దాడిచేసినా ఇంతవరకు స్పందించని స్థానిక పోలీసు అధికారులపై కూడా ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేసి విచారణచేసి శిక్షించాలని, బాధితులకు నష్టపరిహారం ఇవ్వాలని రౌండ్‌టేబుల్ సమావేశం ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది.




**ఇంటిపనివారల సంఘం:** విజయనగరం జిల్లా పార్వతీపురం మండలంలో ఇంటి పనివారలను కార్మికులు గుర్తింపు కార్డులివ్వాలని, పిఎఫ్. ఇఎస్ఐ సౌకర్యాలు కల్పించాలని కోరుతూ లేబర్ కమిషనర్ కార్యాలయం వద్ద ధర్నా జరిగింది. కమిషనర్ గారు జిల్లా వ్యాప్తంగా పరిశీలన చేసి గుర్తింపు కార్డులు ఇచ్చేందుకు ప్రయత్నిస్తామని హామీ ఇచ్చారు.




**బాలల దినోత్సవం కార్యక్రమాలు:-** నవంబర్ 14 బాలల దినోత్సవం సందర్భంగా ఐద్వా ఆధ్వర్యంలో విజయనగరంజిల్లా బొబ్బిలి, సాలూరులలో స్కూల్ విద్యార్థులకు ఆటలు, పాటల పోటీలు, నెల్లూరుజిల్లా 2 స్కూల్స్‌లో విద్యార్థులకు ఆటలు, పాటలు, నాటికల పోటీలు నిర్వహించి బహుమతులు ఇవ్వడమైనది.

అనంతపురం, ప॥గో జిల్లా ఏలూరులో ఆటల పోటీలు నిర్వహించి పిల్లలతో ర్యాలీ, అనంతరం గెలుపొందిన వారికి బహుమతులు అందజేశారు.




పశ్చిమ గోదావరి



అనంతపురం

**నోట్ల రద్దుపై:-** కేంద్రప్రభుత్వం 8వ తేదీన ఐదువందలు, వెయ్యి రూపాయల నోట్లు రద్దు ప్రకటన చేసినప్పటి నుండి పేద, సామాన్య, మధ్యతరగతి ప్రజానీకం తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. నిత్యావసరాల కొనుగోలు, వైద్యం, ఫీజులు తదితరాల కొరకు బ్యాంకుల వద్ద క్యూలలో నిలబడేందుకు గంటల తరబడి సమయాన్ని వెచ్చించవలసివస్తుంది. చిన్న వ్యాపారులు, కిరాణంకు డబ్బులేక కొనలేని పరిస్థితి వల్ల వ్యాపారాలు దెబ్బతిన్నాయి. నోట్ల రద్దును నిరసనగా నెల్లూరు, విజయవాడ, అనంతపురం, విశాఖ, కృష్ణాజిల్లా బ్యాంక్ ముందు నిరసన కార్యక్రమాలు, రాస్తారోకో జరిగాయి.

**వర్ధంతి సభలు:** మోటూరు టాన్యా, తవనం సుబ్బాయమ్మ గార్ల వర్ధంతి సభలు ఒంగోలు జరిగాయి.

**మోటూరు ఉదయం జయంతి :** మోటూరు ఉదయం జయంతి సందర్భంగా అక్టోబర్ 13న మెడికల్ క్యాంప్ తూర్పు గోదావరిలో కాకినాడలో జరిగింది. ఒక డాక్టర్, ఒక స్టాఫ్ నర్స్ సేవలు అందించగా, 70మంది వైద్యం పొందారు.



నెల్లూరు

**ఉపాధి హామీ పనుల వేతనాలకై:** నెల్లూరులో వేతన బకాయిలపై సర్వే చేసి రౌండ్ టేబుల్ మీటింగ్ జరిగింది. ఉపాధి హామీ పనులు చేసిన వారికి వేతనాలు ఇవ్వనందున బందరు, పెనమలూరులో ఎండిఒ ఆఫీసు వద్ద ధర్నా కార్యక్రమాలు జరిగాయి.




నెల్లూరు

**శిక్షణా తరగతులు:** ఐద్వా కార్యకర్తలకు శిక్షణా తరగతులు గుంటూరు జిల్లా స్థాయి క్లాసులు 1 రోజు 'ఆర్థిక సంస్కరణలు మహిళలపై ప్రభావం' అను అంశంపై, ప్రకాశం జిల్లా మార్కాపురంలో 2 రోజులపాటు 80మందితో జిల్లా స్థాయి క్లాసులు జరిగాయి. నెల్లూరు జిల్లాలో రెండు రోజుల పాటు 70 మందితో జిల్లాస్థాయి క్లాసులు జరిగాయి.

**గురజాడ జయంతి:** సెప్టెంబర్ 21న విశాఖలో ఐద్వా, సాహితీస్రవంతి, పియస్ఎమ్‌లు సంయుక్తంగా గురజాడ విగ్రహం వద్ద కార్యక్రమం జరిగింది. 5 స్కూల్స్‌లో దేశభక్తి గేయాన్ని పాడించటం జరిగింది. తూర్పుగోదావరి కాకినాడలో 2 సెంటర్స్‌లో కార్యక్రమాలు జరిగాయి.

ఐద్వా ఆధ్వర్యంలో గురజాడ వెంకట అప్పారావు 101వ వర్ధంతి సభ ఐద్వా జిల్లా కార్యదర్శి వి. సావిత్రమ్మ అధ్యక్షతన సదస్సు జరిగింది.. ఈ సదస్సుకు ప్రముఖ రచయిత సింగమనేని

నారాయణ ముఖ్య అతిథిగా హాజరై మాట్లాడారు. కర్కశమైన మూఢ విశ్వాసాలకు, దురాచారాలు, సమాజ వృక్షపు తల్లి వేరును కత్తిరించి నిర్వీర్యం చేస్తున్న సమయంలో తన కలం బలంతో ఉద్యమించిన విప్లవ మూర్తి, నవయుగ వైతాళికుడు గురజాడ వెంకట అప్పారావు అన్నారు. బాలికా విద్య, వితంతు పునర్వివాహం, కన్యాశుల్కం లాంటి సామాజిక రుగ్మతలతో బలైపోతున్న స్త్రీల సమస్యలను నిర్భయంగా నిగ్గదీసిన సాహితీవేత్త గురజాడ. ఆనాటి సమాజాన్ని వేగు చుక్కలా బాసిల్లిన కవి గురజాడ అన్నారు. సమాజంలో కన్యాశుల్కం పోయి వరకట్నంవచ్చిందని, నాటి పుత్తడిబొమ్మ పూర్ణమ్మ ఆడపిల్ల గడప దాటనివ్వని సంస్కృతి నుంచి కొద్దో గొప్పో ముందుకు వచ్చి విద్యాలయాల గడపలు తొక్కుతున్న ఆధునిక యువతను ప్రేమ పేరుతో యాసిడ్ దాడులు, ర్యాగింగ్ పేరుతోనేటి విద్యా విధానం బలి తీసుకుంటున్నదని ఐద్వా జిల్లా కార్యదర్శి వి. సావిత్రమ్మ అన్నారు. కళాశాల ఛైర్మన్ రాజేశ్వరరావు మాట్లాడుతూ అత్యున్నత మానవీయ కుటుంబ విలువలకు మార్గం చూపిన కవి గురజాడ. మహిళలపై హింస, వరకట్న దురాచారం, సాంఘిక దురాచారాలను నేటి మహిళా లోకం ప్రశ్నించాల్సిన అవసరం ఉందన్నారు. తూర్పుగోదావరి(కాకినాడ)లో ఐదు సెంటర్లలో వర్ధంతి సభలు



విజయవాడ

జరిగాయి.

**స్థానిక సమస్యలు:–** విజయవాడలో 8డివిజన్లలో ఇళ్ళ స్థలాలు, మంచినీరు, డ్రైనేజి, దోమలు, చెత్త సమస్యలపై ధర్నాలు జరిగాయి. చంద్రన్న భీమా పథకంకు ప్రకాశం జిల్లా కందుకూరులో 300మందితో అప్లికేషన్లు పెట్టించడమైనది. నివాస ప్రాంతంలో బార్ షాపులకు వ్యతిరేకంగా విశాఖ గాంధీ విగ్రహం వద్ద నిరసన ప్రదర్శన, ఎక్సైజ్ ఆఫీసు వద్ద ధర్నా జరిగింది. 2,000 సంతకాలు సేకరించి జెసికి ర్యాలీ నిర్వహించి మెమోరాండమ్ ఇవ్వడమైనది. అయినప్పటికీ బార్‌ను ఓపెన్ చేయడంతో ఫర్నిచర్‌ని ధ్వంసం చేసి మద్యం బాటిల్స్‌ని పగలగొట్టడం జరిగింది. విశాఖ రైల్వే జోన్ ఏర్పాటు చేయాలని కోరుతూ ప్రజాబ్యాలెట్‌ను నిర్వహించడమైనది. ఓలంజీడిపిక్కల కార్మికులు సమస్యలను పరిష్కరించాలని కోరుతూ ఐద్వా, సిఐటియు కలిసి కలెక్టారాఫీసు వద్ద నిరసన కార్యక్రమం జరిగింది. తూర్పు గోదావరి '(కాకినాడ)నెక్కంటి సీఫుడ్ పరిశ్రమలో వెలువడిన విషవాయువువల్ల 28మంది గ్రామస్తులు అస్వస్థులయ్యారు. సిటు, ఐద్వా ఆ గ్రామంలో పర్యటించడమైనది. 'షాదీ ఇనామ్' పథకం కింద ముస్లిం వధువుకు ఇచ్చే 50,000రూ॥ల పారితోషికంను కృష్ణాజిల్లా ఉంగుటూరు మండలం, బాపులపాడు గ్రామంలో పేద ముస్లిం యువతికి ఈ పథకం కింద ఇప్పించడం జరిగింది.

**మహిళా జాత :** ఐద్వా 11వ అఖిల భారత మహాసభలు భోపాల్‌లో డిసెంబర్ 10నుండి 14 వరకు జరగనున్న సందర్భంగా హింసలేని జీవితం ప్రతి మహిళా హక్కు, మహిళలకు సమాన పనికి సమాన వేతనం చెల్లించాలి, 50%రిజర్వేషన్లు మా హక్కు, మతోన్మాదాన్ని మట్టి కరిపిద్దాం! ప్రజాస్వామిక రాజ్యాంగ హక్కులను పరిరక్షించుకుందాం!! అనే స్లోగన్స్‌తో అన్ని రాష్ట్రాల్లోనూ ప్రచారం చేస్తూ 10వ తేదిన జాతా భోపాల్ చేరనున్నది. కర్నాటక నుండి మన రాష్ట్రానికి చేరుకున్న అఖిల భారత జాతా అనంతపురం, కర్నూలు, గుంటూరు విజయవాడ మీదుగా తెలంగాణా రాష్ట్రం ఖమ్మంకు చేరుకుంది. డిసెంబర్ 4,5 తేదీలలో ఆంధ్ర ప్రదేశ్‌లోని అనంతపురం జరిగిన బహిరంగసభలో మాట్లాడుతూ కేంద్రంలోని భాజపా ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక మహిళల హక్కులపై తీవ్ర దాడి పెరిగింది. ఎన్నో పోరాటాల ఫలితంగా సాధించుకున్న హక్కులు సైతం కాలరాస్తున్నారు. రాజ్యాంగాన్ని, ప్రజాస్వామిక చట్టాన్ని రక్షించుకుంటేనే మహిళా హక్కులకు రక్షణ ఉంటుందని ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రమాదేవి అన్నారు. కర్నూలుకు చేరుకున్న ఈ జాతా కళారూపాలను ప్రదర్శించడంతోపాటు సి.క్యాంపు కూడలిలో బహిరంగ సభ జరిగింది. మహిళలపై జరుగుతున్న నేరాల్లో మన రాష్ట్రం రెండో స్థానంలో ఉండటం దురదృష్టకరమన్నారు. సమస్యలన్నింటిపై మహాసభల్లో సుదీర్ఘంగా చర్చించి భవిష్యత్తు కార్యాచరణ రూపొందిస్తామని రమాదేవి తెలిపారు. రాష్ట్ర ఉపాధ్యక్షురాలు పి.నిర్మల, రాష్ట్ర కోశాధికారి సావిత్రి, జిల్లా నాయకులు టి.నిర్మల, ఎన్.అలివేలు సభను ఉద్దేశించి మాట్లాడారు. ఈ సందర్భంగా నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాలు, గాయకుల పాటలు సభికులను అలరింపచేశాయి.

# RURAL AND ENVIRONMENT DEVELOPMENT SOCIETY(REDS)

#14-460-1, T.V.TOWER COMPOUND, HINDUPUR ROAD, KADIRI-515 591, ANANTAPUR DISTRICT A.P








## Bhanuja

| | | | |
|---|---|---|---|
| 1.Republic day celebrations award | Government of andhra pradesh | Best NGO in the district | 1999 |
| 2.Republic day celebrations award | Government of andhra pradesh | Best NGO in the district | 2001 |
| 3. NREGS Award | Rural Development principal secretary & Agriculture Minister | For commendable services for effective implementation of NREGS Act in its project area | 2006 |
| 4.Republic day celebrations award | District collector Ananthapur | For rendering commendable services to the target group<br>For Outstanding services to Vulnerable community in the project area. | 2012 |
| 5. World Telugu day celebrations | Sri Lakshmi Sarathi Servieces, kadiri | For commendable work against human trafficking | 2012 |
| 6. She Award | Bharathiya Vidhya Bhavan, Hyderabad | For outstanding efforts for working aganist violence on women | 2013 |
| 7. Naveena Mahila Award | TV9 Telugu channel | For Outstanding contribution for Natural resources management in its project area | 2014 |
| 8. Let us Fight Against women"Break the silence" | Andhrapradesh Women connission | For committed services for protection of women and children aganist violence and explantation. | 2015 |
| 9. Chandranna Rythu puraskaraalu | Department of Agriculture Government of AP. | for rescuing 200 girls from a brothel in Andhrapradesh. | |
| 10. All grass roots women of the decade achivers | Assocham Ladies league | For Vigilant work in rural interiors and vigilance has saved many children from forced labor and migration and prevented women from being tricked into trafficking. | 2015 |





# SR CONSTRUCTIONS

ISO CERTIFICATES

1. ISO 9001:2008
2. ISO 14001:2004
3. ISO 18001:2007

## Special Class Contractors

**Anantapur Office address:** 7/272,Kakateeya Residency Court Road, Anantapur.

**Banglore Office address** : 2A, 2nd Floor, Sycon Polaris,

# 1/58-4, 8th Main Road, RMV Ext., Sadashiva Nagar, Bangalore - 560 080



| | |
|---|---|
| | **మనసు ఫౌండేషన్**<br>**పుస్తకాల పరిశీలనాపట్టిక** |

| | |
|---|---|
| **పుస్తకం సంఖ్య** | CMV01A15H |
| **పుస్తకం పేరు** | చైతన్య మానవి |
| **తారీఖు** | 21/08/2023 |
| **ముందు అట్ట** | Yes |
| **వెనుక అట్ట** | Yes |
| **మొత్తం పేజీలు** | 57 |
| **పెద్ద సైజు పేజీలు** | NO |
| **ఖాళీ పేజీలు** | NO |
| **లేని పేజీలు** | NO |
| **తయారు చేసినది** | Nandini |
| **పేజీలు విడదీసినది** | Nandini |
| **స్కాన్ చేసినది** | Sandhya |
| **పరీక్ష చేసినది** | AMRUTHA |
| **పేజీలు సరిచూసినది** | |
| **బైండింగు చేసినది** | |
| **ప్యాకింగు చేసినది** | |
| **స్కాన్ చెయ్యనివి** | |
| **తప్పులు** | NO |
| పరిస్థితి | Good |